శ్రీరస్తు.

# విప్రనారాయణచరిత్రము.



ఇది

కవిత్రయమునందలి యెఱ్ఱాప్రెగ్గడ "చిన్నమనుమఁ" డయిన

## చదలువాడ మల్లనకవిచే

రచియింపఁబడినది.

రెండవకూర్పు.

కాకినాడ.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ

బ్రకటింపఁబడినది.

౧౯౩౭.

వెల ౧౦ అణాలు.

0—2—0

# విషయసూచిక.

ఓమ్.

నమః పరబ్రహ్మణే.

# విప్రనారాయణచరిత్రము.

## పీఠిక.

విప్రనారాయణచరిత్ర మనెడి యీప్రబంధమును చదలువాడ మల్లన కవి రచియించెను.

ఇతఁడార్వేలనియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కవిత్రయములోనివాఁడని వన్నెకెక్కిన యెఱ్ఱాప్రెగ్గడవంశములోనివాఁడు. మల్లనార్యునకుఁ బ్రపౌత్రుఁడు. ఎఱ్ఱనార్యునకుఁ బౌత్రుఁడు. లింగనార్యునకును గామాక్ష్యంబకును బుత్రుఁడు. ఈయంశము లవతారికలోని యీక్రిందిపద్యములవలనఁ దేటపడఁగలవు.

కవి కృత్యాదిని మంగళాచరణాదిక మొనరించి పూర్వకవిస్తుతిఁ జేయుచు—

గీ. సుకవిసంస్తుత్యు శంభుదాసుని నుతింప
నేర్తునే యైన నేను వర్ణింతు నతని
చిన్నిమనుమఁడఁ గావునఁ జిఱుతవాంఁడ్ర
కొదలుపలుకులు ముద్దుసేయుదురు గాదె.

సీ. ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవులపండువులు గాఁగ
వల్మీకభవువచోవైఖరి రామాయ
ణంబు నాంధ్రప్రబంధంబుఁ జేసె
నారసింహునిపురాణ మొనర్చె హరి మెచ్చి
నన్నునెన్నఁడు చూచినాఁడె వనఁగఁ

ప్రౌఢిమై హరివంశభాగముల్ రెండును
రచియించె సభలందుఁ బ్రాజ్ఞు లెన్న

ఆ. దురితహరుఁ బ్రబంధపరమేశ్వరుని జద
ల్వాడనిలయు నాదువంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గ
డను నుతింప బ్రహ్మకును దరంబె ?

అని భారతారణ్యపర్వశేషాదులను దెలిఁగించిన యెఱ్ఱాప్రెగ్గడను వర్ణించి యాతనికి సాక్షాత్పుత్రుఁడు గాక యాతనివంశములోనివాఁ డను నర్థమును సూచించు 'చిన్నిమనుమఁడ' నను విశేషణమును దన కుపయోగించుకొని తన వంశములో మిక్కిలి పూర్వుఁ డనునభిప్రాయమును సూచించు 'వంశకర్త' యనువిశేషణము నెఱ్ఱాప్రెగడ కుపయోగించెను.

మఱియు నీతఁడు గ్రంథావతారికయందుఁ దనతల్లిఁ దండ్రిఁ దాత ముత్తాతల నీక్రిందివిధముగా వర్ణించెను.

క. వినయోన్నతుఁ గామాక్షీ
జననీనందనుని సరససాహిత్యజనీ
జనకుని నార్వేలాన్వయ
జనితుని శ్రీవత్సగోత్రు శైవాచారున్.

శా. రాజుల్ మెచ్చఁగఁ జెప్పె కావ్యములు హేరాళంబుగా నద్రిక
న్యాజాని న్భజియించు నిత్యనియతిం దత్కాలపూజాక్రియా
భ్రాజిష్ణుత్వమునక్ జపించు దినముం బంచాక్షరీమంత్రముం
దేజోవంతుఁడు లింగనార్యుఁడు గుణోత్కృష్టుండు మాతండ్రియున్.

ఉ. శాతకృపాణనిర్దళితశత్రుఁడు సాళువనారసింహధా
త్రీతలభర్తయు న్గజపతిప్రముఖుల్ చతురంతయానభూ
షాతపనీయవస్తువు లొసంగఁ దనర్చిరి నీయనుంగుము
త్తాతయుఁ దాతయు న్భువి విధాతలు మల్లనయెఱ్ఱనార్యులున్.

కవి యవతారికలో నెఱ్ఱాప్రెగడను 'చదల్వాడనిలయు నాదువంశకర్త' నని పేర్కొనుటయే కాక యాతనికిఁ 'బ్రబంధపరమేశ్వర' యను బిరుదమునే నామముగా నుపయోగించి యాతనివంశమున జన్మించినవాఁడ నని యర్థమును దెల్పుచు నతని ఫక్కినే యనుసరించి యాశ్వాసాంతములయందు "ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానంద సౌందర్యధుర్యప్రబంధపరమేశ్వర వంశపవిత్ర లింగనమనీషిపుత్ర శ్రీ కాళహస్తీశ్వరదయాసహాయ చదల్వాడ మల్లననామధేయప్రణీతం బైన" యని వ్రాసికొనుటచే వీరియింటిపేరు తప్పక చదల్వాడవా రని తెలియుచుండఁగా, రావుబహదరు కందుకూరి వీరేశలింగము పంతులుగారి యాంధ్రకవులచరిత్రము, గురుజాడ శ్రీరామమూర్తిగారి యాంధ్రకవిజీవితముగూడఁ గవిత్రయప్రసిద్ధుఁ డగు నెఱ్ఱాప్రెగడ యింటిపేరు 'ఏర్చూరివా' రని తెలుపుటకుఁ గారణ మేమో చర్చింపఁదగి యున్నది.

ఇందులకుఁ గారణము భాగవతషష్ఠస్కంధకర్తయుఁ గసువనామాత్యపుత్రుఁడు నగుసింగయమంత్రి యాఱవస్కంధము మొదల—

సీ. శ్రీవత్సగోత్రుండు శివభక్తియుక్తుఁ డా
పస్తంబసూత్రుఁ డపారగుణుఁడు
నేర్చూరిశాసనుం డెఱ్ఱనప్రెగ్గడ
పుత్రుండు వీరన పుణ్యమూర్తి
కాత్మజుం డగు నాదయామాత్యునకుఁ బోల
మాంబకు నందను లమితయశులు
కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి
సింగధీమణియు నంచిత గుణాఢ్యు
లుద్భవించిరి తేజంబు లూర్జితముగ
సొరిది మూర్తిత్రయంబన శుభ్రకీర్తిఁ
బరఁగి రందులఁ గసువనప్రభువునకును
ముమ్మడమ్మనుసాధ్వి యిమ్ములను వెలసె.

క. ఆకసువయ్యమంత్రికిఁ బు
  ణ్యాకల్పశుభాంగి మున్మడమ్మ మము న్న
  వ్యాకులచిత్తుల నిరువుర
  శ్రీకరగుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్.

అని తనవంశమును వర్ణించుకొనిన పద్యములోని శ్రీవత్సగోత్రత్వమును, శివభక్తియుక్తుఁ డనువిశేషణముచే నాకర్షింపఁబడిన శంభుదాసత్వమును, ఎఱ్ఱాప్రెగడ యనునామమును, సరిపోవుచున్నవి గదా యని యాయెఱ్ఱాప్రెగడయే భారతారణ్యపర్వశేషము దెలిఁగించిన యెఱ్ఱాప్రెగడ యని భ్రాంతిపడుటయే కాని వేఱుగాదు. సింగనమంత్రి తెల్పినవంశావళిలో నెఱ్ఱాప్రెగడవంశమునందు వీరన, ఆదెయ్య, కసువమంత్రి, సింగయమంత్రి యనువారు క్రమజనితపురుషులుగాఁ గనఁబడుచుండ. మనకవి తెల్పిన తనవంశావళిలోని యెఱ్ఱాప్రెగడ, మల్లన, యెఱ్ఱన, లింగన, మల్లన యనువారిక్రమము పైక్రమమునకుఁ గేవలము విరుద్ధముగాఁ గనఁబడుచున్నది. ఒకవేళ, ఎఱ్ఱాప్రెగడవంశమునందు భాగవత షష్ఠస్కంధకర్తకుఁ దరువాత నీమల్లకవి తెల్పిన వంశావళిలోని మల్లన యెఱ్ఱనాదులు పుట్టియుండిరేమో యని యెవ్వరయినను హాస్యాస్పద మయినయుక్తి చెప్పవచ్చును గాని, యిది యెఱ్ఱాప్రెగడయొక్క సువిదితకాలమునకే హాని తెచ్చును. కావున నీ యెఱ్ఱాప్రెగడ లిద్దఱు వేర్వే ఱనియు, వీరికిఁ దోడు శ్రీవత్సగోత్రుఁడు, శివకృపాపాత్రుఁడు, కూచనమంత్రిపుత్రుఁడు, కొక్కోకకర్తయు నగు నెఱ్ఱాప్రెగడ యింకొకఁడు గలఁ డనియు నెఱుంగునది. సింగనమంత్రి వంశకర్త యగు నెఱ్ఱాప్రెగడయే కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడయేని యతఁడు భారతారణ్యపర్వశేష రామాయణ హరివంశాదులను రచియించినట్లు సింగనమంత్రి భాగవతమున వ్రాసికొనకపోవునా! ఇంతయేల, భారతారణ్య హరివంశాదులను రచియించిన యెఱ్ఱాప్రెగడ నావంశకర్త యని మనమల్లనకవి ఘోషించుచుండఁగా నాతనియింటిపేరు చదలవాడవా రగుటలో సంశయమేమి? కాఁబట్టి సింగనమంత్రి భాగవతషష్ఠస్కంధములోని పై పద్యమందలి 'పురహరశాసనుం' డను విశేషణమును బట్టి కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ

యింటిపేరు 'ఏర్చూరివా' రని భ్రాంతిపడరా దనియు, నెఱ్ఱాప్రెగడలు పలువురు గల రనియు, సుప్రసిద్ధుఁ డగు నెఱ్ఱాప్రెగడ మనకవికి వృద్ధప్రపితామహుఁ డనియు, నీతనియింటిపేరు చదల్వాడవా రనియు స్పష్టపడుచున్నది. సింగన మంత్రి వంశకర్త యైన యెఱ్ఱాప్రెగడ గోలకొండదేశములోని నల్లగొండ మండలమునందలి యేర్చూరుగ్రామమున నుండువాఁడు. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగడ పాకనాటిదేశమువాఁడు. అతఁడు భారతారణ్యపర్వాంతమున—

సీ. భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుం డిలఁబాకనాఁటిలో నీలకం
ఠేశ్వరస్థానమై యెసకమెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు
ధన్యుఁడు ధర్మైకతత్పరాత్ముఁ

గీ. డెఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుఁ
డైననన్నయభట్టమహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజనహర్ష సిద్ధిఁ గోరి.

అనుపద్యమునఁ దననివాసము గుడ్లూ రని వ్రాసికొనుటచే నప్పటి కతఁడు గుడ్లూరు నందే యుండి పిదపఁ జదలువాడకుఁ జేరియుండుటచే నేతద్వంశ్యులకుఁ జదల్వాడవా రనుగృహనామము స్థిరపడి యుండు నని తోఁచుచున్నది. కావుననే యితఁడు తననివాసము గుడ్లూ రని భారతములో వ్రాసికొనుట యెఱింగియుండియు మనకవి యాతనివర్ణించుసందర్భమున "చదల్వాడనిలయము నాదువంశకర్త" నని చెప్పియుండెను. కాఁబట్టి యెఱ్ఱాప్రెగడ యింటిపేరు చదల్వాడవా రగుట నిర్వివాదాంశము. ఏర్చూరివా రనుట భ్రాంతిమూలకము ననాకరము నగును. ఇఁక నీతని "చిన్నిమనుమఁ" డగు మనమల్లన కవి కాలము నీక్రిందివిధముగాఁ దెలియఁ దగును.

—* కవి కాలము *—

పూర్వోదాహృతపద్యములలో మల్లనముత్తాతయుఁ దాతయు సాళువ నరసింహరాజువలనను, గజపతివలనను గౌరవింపఁబడినారనుటయే యీతని కాలము తెలియుటకు ముఖ్యాధారముగా నున్నది. ఈసాళువ నరసింహరాజాంధ్రపద్య జైమినిభారతమునకుఁ గృతిపతి. డిండిమకవికృత సాళువాభ్యుదయ నామక సంస్కృతకావ్యమునకుఁ గృతినాయకుఁడు. ఆంధ్రవరాహపురాణకృతిపతి యగు తుళువనరసింహరాజునకుఁ బ్రభువు. ఈరాజించుమించుగాఁ గ్రీ. **1500** సంవత్సరపర్యంతము కర్ణాటరాజ్యము పాలించినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. ఈకాలమునఁ గర్ణాటరాజ్యములోని తూర్పుదేశములో నెల్లూరిసీమలోని యుదయగిరివఱకును గటకపురాధీశ్వరులగు గజపతిరాజు లాక్రమించుకొని యుండఁగా **1515** సంవత్సరప్రాంతమునఁ గృష్ణదేవరాయలు, వారి నోడించి యాదేశము స్వాధీనముచేసికొనెను. దీనింబట్టి మల్లనకవితాత **1500** సంవత్సరప్రాంతమున జీవించియుండవచ్చు నని యూహింపనగును.

మఱియు, నీకావ్యము కార్వేటినగరరాజగుతిరుమలరాజున కంకితము. ఈతిరుమలరాజు తండ్రి మాకరాజు. ఈమాకరాజుకొడుకగుతిరుమలరాజు కుమారుఁడు రాజ్యము సేయుచుండఁగాఁ గార్వేటినగరసంస్థానములోఁ జేరిన నారాయణవనగ్రామము నందలి కల్యాణవేంకటేశ్వరస్వామికి **1544, 1545** శాకాబ్దములలోఁ గొందఱు భూమ్యాదిదానములు చేసినట్లు దేవాలయద్వారములమీఁద రెండుశాసనము లున్నవి. **1545** వ శాకాబ్దము **1623** వ క్రైస్తవాబ్దమునకు సరిపడును. ఈసంవత్సరము మల్లనకవికుమారుని తరములోనిదయి యుండు నని యూహించినచో మల్లనతాతకును మల్లనకుమారునకును **120** సంవత్సరముల యంతరముండును. తరమునకు **30** సంవత్సరములపైగాను, **40** సంవత్సరములలోపుగాను నయినది. ఇది యసంభావ్యముగాదు. ఈ లెక్కను బట్టి మల్లనకవి రమారమి **1585** వ క్రైస్తవాబ్దమున నుండినట్లు చెప్పవచ్చును.

పరమయోగివిలాసకర్త యగుతిమ్మభూపాలుఁడు నీకాలమువాఁడే. ఇతఁడు తాళియరామరాజ తిరుమల వేంకటాద్రులకు భాగినేయుఁడ ననియుఁ,

గొండవీటి రాజ్యమును బాలించునపు డీగ్రంథమును రచియించితి ననియు జెప్పికొనెను. ఈతని మేనమామ లగుపైరాజులు కర్ణాటరాజ్యాధిపతి యగు సదాశివరాయలకు మంత్రులుగా నుండిరి. 1565 లోఁ గర్ణాటులకును దురుష్కులకును తల్లికోటలో జరిగిన ఘోరయుద్ధములో రామరాజును వేంకటాద్రియు హతులైరి. మఱికొంతకాలమునకు సదాశివరాయలు చనిపోయి యంతటితోఁ దుళువవంశ మంతరింపఁగాఁ దిరుమలరాయలు కర్ణాటరాజ్యమునకు రాజయ్యెను. సదాశివరాయల కాలములో 1486 వ శాకాబ్దమునకు సరియగు రక్తాక్షి సంవత్సరము దాషాఢశుద్ధ ౧౧ నాఁడు "శ్రీమన్మహామండలేశ్వర రామరాజు తిరుమలరాజయ్యదేవమహారాజులుంగారు" అప్పాపండితుఁ డనునాయనకుఁ గొండవీటిసీమలో భూదానముచేసి తామ్రశాసన మిచ్చి రనియు నాసంగతి "సిద్ధిరాజు తిమ్మరాజయ్యవారికి ఆనతిస్తేను ఆసిద్ధిరాజు తిమ్మరాజయ్యవారు దానమును బరిపాలించినా" రనియుఁ గొండవీటి దిగువకోటలో నున్న గోపీనాథస్వామి యాలయములో మధ్యమండపము నుత్తరద్వారము తూర్పుబాలిమీఁదఁ జెక్కఁబడిన శాసనమువలనఁ దెలియుచున్నది. క్రైస్తవమానముచేఁ బై సంవత్సరము 1564 అగుచున్నది. ఇది తల్లికోటయుద్ధమునకుఁ బూర్వసంవత్సర మయినది. ఈకాలమునందే పరమయోగివిలాసము పుట్టిన దనికొనినచో దానికిని మన మింతకుము న్నేర్పఱచిన యావిప్రనారాయణచరిత్రకాలమునకును రమారమి 20 సంవత్సరముల యంతర ముండును.

ఇఁక వైజయంతీవిలాస మెపుడు పుట్టినదో చూతము. తమ్మయకవి తనవంశము వర్ణించుచుఁ జివర నిట్లు చెప్పెను.

చ. ఇనసమతేజు లౌనృపుల నెల్ల మహమ్మదుశాహి యేలునీ
యెనుబదినాల్గుదుర్గముల నేలినయేలిక గోలకొండఁ ద
ద్ఘనగరస్థలిం గరణికం బొనరించెడుఁ దమ్మమంత్రి యా
జనపతి రమ్మ్మ పొమ్మనఁ బ్రజల్ జయవెట్ట గృహస్థు లౌ ననన్.

వైపద్యములో వర్ణింపఁబడిన తమ్మమంత్రియే వైజయంతీవిలాసకర్త యని రావుబహద్దరు వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడియున్నారు. దీని

పై పద్యములలో వర్ణింపఁబడిన వంశక్రమమును బట్టి చూడఁ బైయభిప్రాయ సరియైనది గానే తోఁచుచున్నది. కాని, పద్యములోఁ బ్రథమపురుషప్రర గమును, దాని తరువాత "అట్టివంశంబున సుహోన్నతుండనై వివిధభోగం లనుభవించుచుండ" నను వచనంబును, పైపద్యమునందుఁ బేర్కొనఁబడిన తః మంత్రి కవికిఁ బూర్వుఁడేమో యనుసంశయము గలిగించుచున్నవి. మహమ్మ శాహి యను గోలకొండనవాబు 1581-1611 క్రైస్తవ సంవత్సరముల నడు రాజ్యము చేసెను. ఇతని కాలమందు గోలకొండకుఁ గరణముగా నున్నతః మంత్రి వైజయంతీవిలాసగ్రంథకర్తయే యయినయెడల నాతఁడు 1600 సం త్సరప్రాంతమున నుండె నని యూహింపవచ్చును.

పై చర్చంబట్టి తిమ్మభూపాలుఁడు క్రీ. 1564, మల్లనకవి 158 తమ్మయకవి 1600 సంవత్సరములయందుండి రని తెలియుచున్నది. అనఁగా గొంచె మించుమించుగా నీముగ్గురు సమకాలికులే యని తేలుచున్నది. 16( ప్రాంతమందుండిన తమ్మమంత్రి వైజయంతీవిలాసకర్తకుఁ దాత యని యు హించినచో నక్కవి యింకను 50, 60 సంవత్సరముల తరువాతివాఁ డ యెంచవచ్చును. మూఁడుగ్రంథములు చదివిచూడఁగాఁ బరమయోగివిలాసము: మల్లనకవియు, విప్రనారాయణచరిత్రను దమ్మయకవియుఁ జదివియుండు ర యు, విప్రనారాయణ చరిత్రమునకు మెఱుఁగుపెట్టవలె ననుతలంపుతోఁ దమ య వైజయంతీవిలాసము రచియించె ననియు స్ఫురింపకపోదు.

—* మూలకథ *—

పన్నిద్దఱాళ్వారు లనుభగవద్భక్తులలోఁ జేరిన తొండరడిప్పొడియా ళ్వారు (భక్తాంఘ్రిరేణువు) చరిత్ర మీగ్రంథమున వర్ణింపఁబడినది. దీనిమూ కథ ద్రవిడభాషలోనిది. అదియే ప్రపన్నామృత మనుసంస్కృతగ్రంథమునకున మాతృక యయినట్లు తోఁచుచున్నది. తొండరడిప్పొడియాళ్వారుచరిత్రమ పరమయోగివిలాసము మూఁడవయాశ్వాసమున నున్నది. ఆకథను మాత్రమే గ్రహించి చదలువాడ మల్లనకవి విప్రనారాయణచరిత్ర మనియు, సారంగ తమ్మయ్య వైజయంతీవిలాస మనియుఁ బ్రబంధములు రచియించిరి. ఈమూఁడు గ్రంథముల పౌర్వాపర్య మిదివఱకే నిర్ణయింపఁబడినది.

ఈమూఁటియందు నీపద్వైవమ్యరుగా మూలకథాసారము సమానము. ఎట్లనః—చోళదేశములో మండగుడి యనుగ్రామమున నొకబ్రాహ్మణుఁ డుండెను. అతనికి విప్రనారాయణుఁ డనుకొడుకు గలఁడు. అతఁడు సహజ వైరాగ్యసంపన్నుఁడును భగవత్కైంకర్యతత్పరుండు నయి శ్రీరంగమున కేఁగి యచ్చటఁ బువ్వుఁదన మొకటి నిర్మించికొని పూలదండలు గ్రుచ్చి నిత్యము శ్రీరంగనాథున కర్పించుచు మాధుకరవృత్తిచే దేహధారణము చేయుచుండెను. ఇట్లుండ నొకనాఁడు వేశ్యాంగన లిద్ద ఱాదారినిఁ బోవుచు నావైష్ణవబ్రహ్మచారిని గని "యీతఁడు దృఢవైరాగ్యసంపన్నుఁ" డని యొకతెయు, "నెట్టివాఁడయిన వనితకు వశ్యుఁడు గాకపోఁ" డని యొకతెయు వాదించుకొని వారిలో దేవదేవి యనునది "యీతనిఁ దప్పక కాముకునిఁ గావించెద" నని ప్రతిజ్ఞ యొనరించెను. వెంటనే యది తనభూషణములను త్యజించి దాసరిసాని వేషమును బూని యాభూసురునిఁ జేరి "నీచమైన వేశ్యావృత్తికి రోసి వైరాగ్యమూని నీసేవకై వచ్చితి" నని కపటవాక్యములు చెప్పి యాతని నమ్మించి యాతఁడు తనదాస్యమున కంగీకరింప నాతనికి సాహాయ్య మొనర్చుచు నందే యుండెను.

ఇట్లుండ నొకనాఁటిరాత్రి గొప్పగాలివాన విసరఁగాఁ, దనతోఁట యేమయినదో యని యావిప్రుఁడు తనపర్ణశాల తలుపు తెఱచి చూచునంతలోఁ, జెంతనున్న యొకరావిచెట్టుక్రింద వడవడ వడఁకుచు నిలిచియున్న దేవదేవి మెఱుపువెలుతురున నాతనికిఁ గనఁబడెను. అంత దయార్ద్రహృదయుఁ డగు నతఁడు దానిని గుడిసెలోనికి రమ్మని పిలిచెను. అదియే సందు చేసికొని దేవదేవి లోపలఁ బ్రవేశించి తనజాణతనమున నాబ్రహ్మచారిచే మదనసామ్రాజ్య మేలించెను. పిదప దానితోఁ గూడి యతఁడు దానియింటికిఁ బోయి, రిక్తుఁ డగుటఁ గొంతకాలమునకు దానితల్లిచే నిల్లు వెడలఁగొట్టఁబడి విచారించుచు దానిపంచనే పడియుండె. ఇట్లుండ, శ్రీరంగస్వామి తనభక్తునియందలి యనురాగమున శిష్యవేషముఁ బూని తనయాలయములోని బంగరుగిన్నె యొకటి తీసికొని వచ్చి విప్రనారాయణుఁడు పంపినట్లుగా వేశ్య కొసంగెను. పిద

నదియు మరల నాతని రావించి ప్రేమించెను. అంత, మఱునాఁడు గుడిలోని స్వర్ణపాత్రము లేమిని బూజారు లధికారికి విన్నవింప నావృత్తాంతము చిట్టచివరకుఁ జోళరాజు వఱకుఁ బోయెను. రాజభటులు దేవదేవీవిప్రనారాయణులను బంగరుగిన్నెతోఁ గూడ రాజునెదుటకుఁ దీసికొని వచ్చిరి. రాజును వారిరువురను గిన్నెవృత్తాంత మడిగి తెలిసికొని, తుదకు విప్రుఁడే దొంగ యని నిశ్చయించి, దండనము విధింప నున్నంతలో శ్రీరంగనాథుఁడు ప్రత్యక్షమై యిది యంతయు విలాసార్థమై తానుజేసిన పని యనియు, విప్రనారాయణుఁడు దోషి గాఁ డనియుఁ జెప్పి యంతర్ధాన మయ్యె.

—* కథారచనము. *—

తిమ్మభూపాలుఁ డీకథను బెంచక భక్తిరసప్రధానముగా మృదుమధుర శైలిని వర్ణించెను. మల్లన తిమ్మయ్యా లిరువురును యథామతిగాఁ బెంచి శృంగారరసప్రధానముగాఁ బ్రబంధశైలిని రచియించిరి. వీరిలో మల్లనకవి కథాప్రారంభంబునఁ జోళదేశము, అందు మండగుడి యనుగ్రామము, హరివనమాలి కాంశ మాగ్రామమున నొకవైష్ణవస్త్రీకి విప్రనారాయణుఁడై జన్మించుట, విష్ణుభక్తుం డగు నతఁడు కథకు రంగస్థల మయిన శ్రీరంగపురమును జేరుట, శ్రీరంగపురము, తత్రాంత మందలి కావేరీద్వీపంబున నొకపుష్పారామము నిర్మించుకొని యతండు నిత్యము పూలమాలికలు శ్రీరంగేశునకు సమర్పించుచుండుట యనునంశములను యథాక్రమముగా సందర్భోచితంబుగ సరసముగా వర్ణించె. వైజయంతీవిలాసమందుఁగూడ నియ్యంశము లన్నియుఁ జక్కఁగా వివరింపఁబడినవి, గాని, చోళదేశమునకు బదులుగాఁగూడ శ్రీరంగపురమే ముందుగా వర్ణింపఁబడుటచే నివ్వర్ణనము ద్విరుక్త మయినది. హరివనమాలికాంశమే విప్రనారాయణరూపంబున నుదయించె ననువిషయ మీరెంటియందును దుల్యమే యైనను, నారాయణుని పుష్పమాలికయే స్వయముగా భూమిపై నవతరింపఁ దలఁచి యొకవిప్రస్త్రీగర్భమునఁ బ్రవేశించె నని యిందును, గొండొక వైష్ణవాంగన సంతానము లేక విచారించుచుండఁగా నామెకుఁ గలలో శ్రీహరి గన్నడి పూలదండ నిచ్చినట్లును దానిచే నామె గర్భము దాల్చినట్లును వైజయంతీ

విలాసంబునను గొంచెము భేదముగాఁ గన్పట్టుచున్నది. ఇక్కథకు మూలమైన ద్రవిడపురాణములో నెట్లున్నదో కాని, వెక్రంగ్రం విష్ణుభక్తులకథలను దెల్పు పరమయోగివిలాసమందుఁ గూడ—

ఉ. ఆపురియందు నొక్కవసుధామరముఖ్యునకుఁ జనించెఁ బ
 ద్మాపతిదాల్చునట్టి వనమాలికయంశమునం దనూజుఁడు ...

అని యుండుటచే వైజయంతీవిలాసంబున స్వప్నవృత్తాంత మపూర్వముగాఁ గల్పింపఁబడిన దని చెప్పవచ్చును.

మఱియు—

చ. అనుచును సంతసించి తనదైన వినోదము చూపఁగోరి చ
 క్కని దగు నిండుజవ్వని నొకానొకయచ్చరపూవుఁబోఁడిఁ జ
 య్యన హృదయంబునం దలఁప నయ్యది సమ్ముఖమందు నిల్చి వం
 దన మొనరింపఁ జూచి యెలనవ్వు గనుంగవ నంకురింపఁగన్.

అనునది యాదిగా నవ్యాజభక్తియుక్తుం డగువిప్రనారాయణునిభక్తి కానందించి, శ్రీరంగేశుఁ డొకవినోదము సేయఁదలంచి, యొక యప్సరసను రప్పించి 'నీవు భూలోకంబున వేశ్యవై జనింపు' మని చెప్ప, నదియే యిందలికథానాయిక యగు దేవదేవియై పుట్టినట్లుగా నీగ్రంథమున వర్ణింపఁబడినది. కథాంతంబున బంగరుగిన్నె దొంగిలించె ననెడి యపవాదమును దొలఁగించి శ్రీరంగస్వామి విప్రనారాయణుని రక్షించె ననెడి విషయంబునకుఁ బ్రధానబీజమై యొప్పెడి యీకల్పన మిందే కాక పరమయోగివిలాసంబునఁగూడ—

క. ఈరీతి ననుదినముఁ బు
 ష్పారాధన సేయుచుండ నాత్మ నలరుచున్
 శ్రీరంగవిభుఁడు సిద్ధమ
 నోరథుఁ డొకచిట్టకపువినోదముకోరెన్.

వ. అప్సరోవిలాసిని నొక్కతె రప్పించి ... నీవు నర్తకివై యుదయింపుము. అని కన్పట్టుచున్నది.

కథాసన్నివేశకౌశలమం దీముగ్గురుకవులలోఁ దారతమ్యము నిరూపింప వలసినచోఁ గొన్నిపట్లఁ దిమ్మకవియే యధికుఁ డని చెప్పఁదగినను, ననేకప్రధాన విషయంబుల నల్లసనియే మే లనిపించుకొను నని మాయభిప్రాయము.

—* నాయకుఁడు *—

సహజవైరాగ్యసంపన్నుఁడును, భగవదధీనమానసుండును నగుబ్రహ్మచారని దేవదేవి విటునిఁగావించుపట్టే యీకథయందు రసమున కునికిపట్టు. తిమ్మభూపాలుఁ డీవిషయము నొకవిధముగాఁ దేల్చివైచెను, గాని, రసపోషణ మంతగాఁ గావింపలేదు. విప్రనారాయణునిమన స్సొకసంవత్సరమువఱకుఁ జలింపకుండె నని నిరూపించి యాదృఢధైర్యమును భేదించుటకై చీఁకటిలో గాలివాన నుపాయముగాఁ గల్పించెను. ఇది యుచితముగానే యున్నదిగాని, "చీఁకటు ల్విరియు టారసి పబ్బు తెఱంగుఁ జూచి" నాబ్రాహ్మణుఁడు గుడిసె తలుపు తీసి చూచె నని చెప్పుటచేఁ దలుపుతెఱచిచూచుటకుఁ బ్రయోజన మంతగా లేకపోయినది. ఇది కథలో ముఖ్యాంశ మగుటచే దీనికిఁ దగినహేతువుఁ గల్పింపక పోవుట యొకలోపము, మఱియు, దేవదేవి యలంకరించుకొని గుడిసెలోపలకుఁ బోఁగానే—

ఉ. ఇమ్మెయి నేఁగుదెంచిన మృగేక్షణఁ గన్గొని చోద్య మందుచుం
గ్రమ్మఱ నోనితంబిని సుగంధపటాభరణాదికంబు నీ
నెమ్మది కింపె నేఁడు ... ... ... ...

అని విప్రనారాయణుఁడే ముందుగాఁ బల్కరించె ననియు, నంతమాత్రముననే యావేశ్య చనవుఁ గల్పించికొని,

ఉ. ఏమని మాఱుదాన నొకయేఁ డగుచున్నది నిన్నుఁజేరి యో
భూమిసుపర్వ తోఁటపనిపూనికవేళ నకాని యెప్పుడుం
బ్రేమను జేరవచ్చుట యభీష్టముఁ జెప్పుట మంచిమాపుచే
నా మొగముం గనుంగొనుట సవ్వట గానము యించుకేనియున్.

గీ. నీను దక్కినట్టియింతులయట్లు కా
కకట ! యధిక నే సమస్తవిదుఁడ !
వెర్కులేల యోర్వంబ్రియుఁడ యింక ! విడంబ
మనుచుఁ జేరి పట్టె నంఘ్రిశీలము.

ఇట్లావిప్రుని లోఁబఱచుకొనె ననియుఁ జెప్పుటచే విప్రనారాయణుని ధైర్యమునకుఁ గొఱఁత గలిగినది. అప్రయోజనముగాఁ దలుపు తెఱచి దేవదేవిని జూచి విప్రుఁడు లోపలకు రమ్మనుటయు, నకాంత యట్లురా వేగమే దానితో సరససల్లాపము లాడుటయు నతండు తలుపు తెఱచుటకు ముందే యతనిచిత్తము దానిపైఁ దగులుకొనె నని సూచించుచున్నది. దానివలన నాయకుని ధీరతకుఁ గొంత హాని గలిగినది.

ఇంతకంటెఁగూడ వైజయంతీవిలాసములోని నాయకుఁడు మిక్కిలి బేలగా వర్ణింపఁబడుటచే మొత్తముమీఁద విప్రనారాయణచరిత్రయందలి నాయకుఁడే యౌచిత్య మతిక్రమింపక యామూలాగ్ర మొక్కరీతిగా వర్ణింపఁబడె ననుట నిక్కము. దేవదేవి దాసరిసాని వేషంబునఁ బరిచర్య సేయవచ్చుటయు, దానివైరాగ్యమునకుఁ గారణంబుఁ బరీక్షించుటయు, దానిసపర్య నంగీకరించుటయు ననుకథాంశంబు లుభయత్ర సమానముగానే యున్నవి, గాని, యిందలి నాయకుఁడు దానిని వేఱుగా నొకపాదలో నుంచెను, గాని, వైజయంతీవిలాసమందు వలెఁ దనపర్ణమందిరముననే యుంచికొనలేదు. మఱియు, నిందు నాయిక యొకసంవత్సరముగా సేవసేయుచున్నను నాయకుఁడు రాతిగుండెతో నెప్పటివలెనే వైరాగ్యధీరుఁడై యట్లే యుండెను, గాని, వైజయంతీవిలాసమందువలెఁ గొన్నిదినములకే దానిపరిచయమున మెత్తపడి దానిపరిచర్యకుఁ దాను బూనుకొన నారంభింపలేదు. మఱియు, నొక్కనాఁడు నడికిరేయి పెద్దగాలియు వానయు రాఁగాఁ దనపుష్పవన మే మయినదో యని తలుపుతీసి చూచుచున్న యిందలి నాయకుఁడు, వానలోఁ దడియుచుఁ దన్నుఁ బిలుచుటకుఁగూడ జంకి రావిచెట్టు చాటున నిలువఁబడియున్న నాయికను మెఱుపుఁ గాంతిచేఁ జూచి విచారించి తనయింటిలోనికిఁ బిలిచి యిందుండు మని చెప్పిన

కథాభాగ మెంతయు స్వభావసిద్ధము గా సరసముగా నున్నది గాని, వైజయం తీవిలాసమందువలె వాన గురియుచుండఁగా నాయకుఁడు తనంతఁ దానే నా యికను బలాత్కరించెద నని తలంచినట్లుగాఁ జెప్పఁబడియుండలేదు.

ఈసందర్భంబున నిందు నాయికను బిలిచినతరువాతఁగూడ నాయకుఁడు సెప్పినమాటలును, వైజయంతీవిలాసములో వానసెపంబున నాయికను బిలువఁ దలఁచికొనుచుఁ దనలో నాయకుఁ డనుకొనినమాటలును నాయకౌచిత్యనిర్ణయం బునకు నిదర్శనములు గాఁగల వని యిం దుదాహరించుచున్నారము.

సీ. తడికాళ్ళతోఁ ద్రొక్కెదవుసుమీ యిదె కుశా
స్తరణ మాత్మధ్యానసమయ మయ్యె
సెడలేదు వేష్టువ లిటుకమ్మ ముట్టెదు
గనుక ప్రాతస్స్నానమునకు వలయుఁ
దీరంబుపైఁ దీర్థపెరుమాళ్ళు వేంచేసి
యున్నవా రపచార మోసరిల్లు
పెట్టినారము పట్టి బుట్టిలోఁ దులసిని
జతనంబు భానువాసరము రేపు

గీ. పల్లె మామూల వలిపిరి చల్లు నిచట
నటియు నీచాయ నిద్రమై నుందు నిచట
మహిత రామానుజోదీర్యమాణ భావ్య
ముఖబహుగ్రంథసామీప్యమునకుఁ జనకు. విప్రనారా.

ఉ. వారిజపత్రనేత్ర నిటు వానసెపంబున నింటిలోనికిం
జేరఁగఁ బిల్చి నాతలఁపుఁ జెప్పినఁ జేకొనకుండినన్ బలా
త్కారము దోషమంచుఁ బలుకం బరభామిని గాదు చెంతనుం
జేరినమీఁదఁ గుక్కుటము సేయు నుపాయముఁజేయు టొప్పగున్.
వైజయంతీ.

వైజయంతీవిలాసములోని నాయకుఁడు దేవదేవిని లోపలకుఁ బిలిచి తానే ముందుగాఁ దనమనోరథమును వావిడిచి తెలుప నమ్మాయలాఁడి కొంత

బింకముసూపి యాతని నలయించి చిట్టచివర కియ్యకొనియెను. వేశ్యాసాహచర్య మువలన లోకాపవాదమును బ్రమాదమును గలుగునని భయపడుటచేతనే యం దలినాయకుని మనసు పదిలముగా దని స్పష్టపడుచున్నది. కావుననే యతఁ డత్యల్పకాలముననే కాముకుఁ డయ్యె. నాయికయు నెట్లయిన నతని వశపఱు చుకొనుటకే యత్నించుచుండె. ఇట్టిరువురకు సమావేశాసక్తి సిద్ధమై యుండఁ గాలివాననెపమును గల్పించుటకంతగా నవసరము గానరాదు. దీనివలన నా యిక ప్రౌఢధీరయు, నాయకుఁ డధీరుఁడు నైనట్లు తెలియవచ్చుచున్నది. సహజవైరాగ్యసంపన్నునకధీరత యనుగుణము గాదు. నాయకుని ధీరునిఁగా వర్ణించినచో నాయకలక్షణము పోషింపఁబడుటయేకాక, యట్టివానిని వశపఱు చుకొనిన నాయికప్రౌఢిమ గూడ నతిశయించును. మల్లనకవి యీసందర్భ మున కందము దెచ్చెను. ఎట్లనఁగా:—

విప్రనారాయణచరిత్రనాయకుఁడు గాలివాననాఁటిరాత్రి తోఁటఁగతిఁ జూచుటకై తలుపుతెఱచి మెఱుపువెలుతురున దేవదేవిని జూచువఱకు నీసంవ త్సరములోను నాతనిధైర్య మిసుమంతయుఁ జలింపలేదు. అట్టిదృఢధైర్యమును భేదించుటకు సాధారణోపాయము చాలదు గానఁ, గవి గాలివానను మెఱు పును గల్పించెను. చిమ్మచీఁకటిలో మెఱుపు మెఱియుటచే దేవదేవిసౌందర్య మునకు మెఱుఁగుపెట్టినట్లయ్యెను. ఆక్షణముననే నాయకుని హృదయము నందు మనోజాస్త్రమున కించుక యవకాశము గలిగెను, కాని, యాబ్రహ్మ చారి యది యెఱుంగఁడు. కావుననే నాయిక పర్ణశాలలోనికి వచ్చినపుడు గూడ మున్నువ్రాసినట్లుగా దానిని దూరముగానుండ నియమించెను. కాని, దేవదేవి యింతకంటె సమయములే దని తలంచి—

ఉ. గోపవధూసనాథపదకోకనదద్వయభక్తియుక్త యో
తాపసవర్య యీచలికతంబున నిద్దురరాదు విష్ణుగా
థాపదలీలలం గడపెదం దగుప్రొద్దని విన్నవించి యా
లాపము సేసి కోకిలకలధ్వని యెంతయు వింతసేయఁగన్.

మ. తలిరుంబోఁడి దొడంగి మాధవుఁడు రాధంగూడి క్రీడించుగా
థలు కుబ్జం గయికొన్న వార్తలును సత్యావాంఛ లీడేర్చు సు
ద్దులు నాభీరవధూటులందుఁ గలపొందుల్ రుక్మిణీదేవిపై
చెలిమిం గ్రొన్ననయిచ్చులాగు వినిపించె న్మాధురీవైఖరిన్.

వ. ఇవ్విధంబున శృంగారప్రధానంబు లగుకథాప్రసంగంబులం గొంత యభిము
ఖుం జేసి కలఁకయగు ధైర్యంబున నున్న యతనిం జేరంజని.

చ. పడఁతుక తేనె లట్టిపడఁ బల్కెను వానికులావతంస యిం
పడరఁగ మార్దవంబు నెల వయ్యెడు నీచరణంబు లొత్తెదన్
బడలినవార లిందనుకఁ బాదులు ద్రవ్వియుఁ గారె మొత్తియున్
మడవలు దీర్చియుం బిదప మార్చియుఁ గాలువ లేర్పరించియున్.

అని యిట్లుగా నతని కనురాగ ముంకురింపఁజేసి యాతని సమీపించి, పాదసంవాహనంబున కంగీకరింపఁజేసి, తుద కతని మనోజాస్త్రంబుల కిరవు గావించె.

దీనివలన నాయకుఁడు సహజముగా ధీరుఁ డనియు, నాయిక సహవాస మొక సంవత్సరమువఱకు నతనిధైర్యమును జలింపఁజేయలేకపోయిన దనియు, గాలివానలో నాయికను మెఱుపువెలుతురునఁ జూచినపుడే రాగ మావిప్రుని హృదయమును స్పృశించి, శృంగారగీతాశ్రవణంబున నాశ్రయించి, పాదసంవాహనంబునఁ బ్రజ్వరిల్లి యతని ధైర్యమును నిర్మూలము చేసిన దనియుఁ దేలుచున్నది. మదనుఁడు విప్రనారాయణుని హృదయదుర్గమును సంవత్సరము ముట్టడి వైచి యేమియుఁ జేయఁజాలక, యంత దైవసంకల్పమున నొక్కయదను కుదుర నది సందుచేసికొని చీఁకటిలో విద్యుత్కాంతిచే దేవదేవిని జూపుట, యాసుందరిచేఁ బాటలు పాడించుట, పాదము లొత్తించుట యనుమూఁడు వాఁడియమ్ముల నొకటిమీఁద నొకటి ప్రయోగించి ధైర్యప్రాకారమును భగ్నముగావించి హృదయదుర్గము నాక్రమించికొనెను.

అంతకాలము సురక్షిత మయినధైర్య మొక్కగడియలోఁ జెడిపోయె ననుట స్వభావసిద్ధము గా దని కొందఱకుఁ దోఁచవచ్చును, గాని, యది సరి గాదు. కలకాలము జాగరూకులుగా నున్నపురుషులు దైవవశమున భ్రష్టులగుట యసాధారణ మని చెప్పినఁ జెప్పవచ్చును, గాని, యది స్వభావవిరుద్ధము గాదు. స్వాభావికము నసాధారణము నయినవస్తువే కావ్యయోగ్యము. ఈకారణములఁ బట్టి కథాసన్నివేశమందును, నాయకచరితౌచిత్యమునందును మల్లనకృతియే యుత్తమ మని తేలుచున్నది.

—* నాయిక *—

జితేంద్రియుఁ డగు నివ్విప్రుని వశపఱచికొనుట యశక్య మనుతలంపుతో మధురవాణికిని, ఎట్లయిన నితని విటునిఁ జేయవచ్చు ననెడియూహతో దేవదేవికి నేదో యొకవిధముగాఁ బందెము జరగె ననుట యీరెండుగ్రంథములయందును గనఁబడుచున్నది. కాని, యీపన్నిదముయొక్క యుద్దేశమున కనుగుణముగా నిందలి నాయిక యొకసంవత్సర మతిక్లేశపడి, యేల యూరక లేనిపోని కష్టము తెచ్చిపెట్టుకొంటి నని విచారించి, తుద కెట్లో తనప్రతిజ్ఞ నెఱవేర్చికొనినట్లుగా వైజయంతీవిలాసనాయిక ప్రతిజ్ఞానిర్వహణమునకుఁ గ్లేశపడినట్లే కానరాదు. కాని, వైజయంతీవిలాసనాయికవలె నిందలి నాయిక హావభావాదిశృంగారచేష్టలచే నాయకుని మనసు కరఁగించుటకై యెడనెడ విశేషించి యత్నించినట్లును గానరాదు.

—* అమానుషకార్యములు. *—

శ్రీరంగనాథుఁడు వినోదార్థమై మోక్షకామి యగు విప్రనారాయణుని గామిగాఁ జేయఁదలంచి దేవదేవిని జన్మింపఁ జేసెననియు, సంవత్సరముపఱువు నది యేమియుఁ జేయలేమిని జూచి తానే గాలివాన కల్పించె ననియుఁ, దానే శిష్యరూపము దాల్చి బంగారుగిన్నె దేవదేవి కిచ్చె ననియు నిట్లు మూఁడుస్థలములయం దమానుషకార్యములు కల్పింపఁబడినవి. వీనిలో మూఁడ

వది యవశ్యకథాంశమే కావున నుండవలసినదియే; కాని, తక్కినవిరెండు ననావశ్యకము లగుటయేకాక రసభంగకరములుగాఁగూడఁ గన్పట్టుచున్నవి. పరమభాగవతోత్తముఁడు నియమభ్రష్టుఁ డగుటకు భగవత్ప్రేరణము దక్క వే ఱొండు కారణము దగ దని యీయుపపత్తులు గల్పింపఁబడి యుండును. ఇట్టికల్పనలు పురాణములం దనేకములు గలవు. కాని, కావ్యములయం దవి యంద మీయవు. సీతారాములు లక్ష్మీనారాయణావతారము లని తొలుత నొకచోటఁ జెప్పినను, బిదప రామాయణమం దెల్ల వాల్మీకి వారిని మానవులనుగానే వర్ణించెను; కాని, యధ్యాత్మరామాయణమందువలె నడుగడుగునకు వారు లక్ష్మీనారాయణు లని ప్రశంసింపలేదు. కావుననే, వాల్మీకిరామాయణము కావ్య మైనది. సాధారణముగా నాయికానాయకులు తోడిమానవులుగా నుండినఁగాని చదువరులకు వారిచరిత్రమును దెలిసికొనుటయం దాసక్తియుఁ గుతూహలమును గలుగవు. దివ్యపురుషులచరిత్రములు వర్ణించునపుడు గూడ వారిని మర్త్యసమానులనుగా వర్ణించుటయే యుచిత మగుచున్న దని విదితమే. ఎంతటి దృఢచిత్తుఁ డైనను గాలవశమునఁ బ్రమాదవశుఁడు గావచ్చు ననునదియే విప్రనారాయణచరిత్రములోని సారాంశము. విప్రనారాయణుఁడు కాముకుఁ డగుట దైవప్రేరణమువలనఁ గలిగినది గాని, యతనిధైర్యము చెడుటవలనఁ గాదని చెప్పుట ప్రధానకథోద్దేశమునకు భంగము గలిగించుచున్నది.

## —* వర్ణనములు. *—

పరమయోగివిలాసములో హృద్యము లగువర్ణనములు గొన్ని గలవు గాని, భక్తిరసము ప్రధాన మగుటచేతను, గథ విస్తరింపఁబడకపోవుటచేతను వర్ణన లం దంతగా లేవు. తమ్మయకవి దేవదేవి విప్రనారాయణునిఁ జేరుట, వేశ్యావృత్తి, విప్రనారాయణుని వంచించుట, నాయికశృంగారచేష్టలు మొదలగువానిని మిక్కిలి సరసముగా వర్ణించెను, గాని, కొన్నిచోట్ల సందర్భౌచిత్యమునకు విరుద్ధముగా వర్ణనములు పెంచెను. నాయకుని వర్ణించినపిదప గ్రీష్మర్తువర్ణనమునకుఁ బూర్వము వసంతవర్ణనము గావింపఁబడినది. ఇది నిష్ప్రయోజనము. మల్లన దీనిని విసర్జించెను. దేవదేవీమధురవాణులు రాజసభనుండి యిం

టికిఁ బోవుచు విప్రనారాయణుఁ డున్నచోటికి వచ్చి రని చెప్పినపుడు మల్లన నాలుగు పంక్తులలో నిమిడ్చిన రాజసభావర్ణనమునకుఁ దమ్మయకవి యైదారు పద్యములు వినియోగించెను. ఇదియు నప్రస్తుతమే. మఱియు, దేవదేవి నాయకునియొద్దకు వచ్చి తనవృత్తాంత మంతయుఁ దెల్పుసందర్భమును మల్లనకవి తొమ్మిదిపద్యములతో హృద్యముగా వర్ణించియుండఁగాఁ దమ్మయకవి దానిని బెంచి ముప్పదిపద్యములు చెప్పెను. దేవదేవి తన వైరాగ్యమును విస్పష్టపఱచుటకు వేశ్యావృత్తిని నిందించుట యుచితమే, గాని, తమ్మయకవి చేయించినట్లతిమాత్రగా నిందించుట యుచితము గాదు. నాయకునిఁ గవయుతఱి వస్త్రవిసర్జనము గావించిన నాయికను తమ్మయకవి వర్ణించినవర్ణన జుగుప్సాకరముగా నున్నది. మల్లనకవి యీసందర్భమును మిక్కిలి గుప్తముగా వర్ణించెను.

—* హాస్యరసము. *—

మల్లనకవి హాస్యరసమునుగూడ సమయోచితముగా నందందుఁ బ్రయోగించెను. దేవదేవి వైరాగ్యోపన్యాసముచేసి, తనమాటల నాబ్రహ్మచారి విశ్వసించి తన్నుఁ గుశలప్రశ్న మడుగఁగా నది "చిక్కె దమ్మి" దని సంతసించినట్లును, దేవదేవి పర్ణశాలలోనికి వచ్చినపుడు దానిసంపర్కము తన కెక్కడఁ గలుగునో యనుభీతిచే "తడికాళ్ళతోఁ ద్రొక్కెదవుసుమీ..." యనునట్లును జెప్పినవర్ణనములు నవ్వు పుట్టింపకపోవు. నాయిక వెంట వేశ్యావాటికకుఁ బోవునపుడు తన వస్తువు లన్నియుఁ బాఱవైచి, దానిబట్టల మోచుకొని పోవుచున్న నాయకుని వర్ణన మెట్టివారికైనఁ గడు పుబ్బ నవ్వింపక పోదు. విటుకంటకి వేషము, దానిమాటలు, దానికృత్యములును దెల్పుభాగమును జదువునపుడు హాస్యముతోఁగూడ వేశ్యాసాంగత్యము నందలి కోఁత కన్నులకుఁ గట్టినట్లు తెలియకపోదు. శ్రీరంగస్వామి బంగరుగిన్నె తెచ్చి తలుపు తీయుము మని పిలిచినపుడు విప్రనారాయణుఁడే వచ్చినాఁ డనికొని విటుకంటకి యన్నమాట లామాయావిష్ణువునకుఁగూడ నవ్వుగలిగించుట యచ్చెరువు గాదు. ఇట్లే యీభాగమంతయు సరసముగా హాస్యశృంగారముగా వర్ణింపఁబడినది. తమ్మయకవియు నీపట్టున హాస్యరసపోషణము గావించెను, గాని, కొన్ని తావుల హద్దు మీఱెను.

వేశ్యలు తొలుత విప్రనారాయణునిఁ జూచినసందర్భమునఁ దమ్మయకవి—

సీ. ప్రతిమాసవపనముండిత మైనమస్తంబు
పెడతలఁ దూలాడుపిల్లసిగయుఁ
దులసినెత్తమ్మిపూసల గొప్పపేరులు
విపులరంధ్రము లైనవ్రేలుఁజెవులు
నడువీథి గల నిల్వునామంబుపట్టెలు
శోభితం బగుతిరుచూర్ణరేఖ
పెన్నాలిత్రాటఁ గీల్కొన్న కౌపీనంబు
వితతంపు నీర్కావివేష్టువలును
గలిగి పద్మాసనస్థుఁ డై కన్ను మోడ్చి
భగవదారాధనైకతత్పరతనున్న
శ్రీమదష్టాక్షరీమంత్రచింతనాప
రాయణుం డైన విప్రనారాయణుండు.

అని వర్ణించెను. ఈవర్ణనము కొంతవఱకు స్వభావోక్తియే యైనను, రూపము హాస్యాస్పదముగా వర్ణింపఁబడినది. ఈసందర్భమున విప్రనారాయణుని గౌరవాస్పదుఁ డగుభగవద్భక్తునిఁగా వర్ణింపవలయును గాని, హాస్యాస్పదునిఁగా వర్ణించుట యనుచితము. ఈవర్ణనమే మల్లనకవి ప్రౌఢముగాను సమయోచితముగాను గావించె నని సహృదయులు తలంపకపోరు. అది యెట్లన:—

సీ. తొగ లేనిలోకందు దిగజారె నన(గ మొ
గమ్మున బవిరిగడ్డమ్ము మెఱయ
నుదయాద్రిశిఖరంబు తుద భానుబింబంబు
సాటి నొదలఁ గావిశాటి మెఱయ
బొమల నెన్నడిమిపద్మము దళంబులరేఖ
రహిఁజూపు నూర్ధ్వపుండ్రంబు నిగుడ

లోనిడి హరిభక్తి పైవి ముద్రించెనా
శంఖచక్రములు భుజములఁ జెలఁగఁ

ద్రిపథగాభావ మొకచోటఁ దెలుపుచున్న
త్రిదశనదివోలె నలుత జన్నిదము దనరఁ
బూర్ణతరుమూలజలకుంభముల గణించు
సరణితోడుత మాధవస్మరణ మమర.

మల్లనవర్ణించిన—

క. నామములు దీర్చి తులసీ
దామంబులు వైచి బేలతనమునఁ దగునీ
సాములె కారా మగువల
బాములఁ బడువారు వేషభాషల గుఱుతే ?

అనుపద్యముకంటెఁ దమ్మకవి చెప్పిన—

క. ఇటువంటయ్యలె కారా
చిటుకు మనక యుండ సంజచీఁకటివేళన్
ఘుటచేటీవిటు లై యి
క్కటుకంబునఁ దిరుగువారు కంజదళాక్షీ !

అనుపద్యమే సరసముగా నున్నది. కాని, దేవదేవి యోగినీవేషము వేసికొని విప్రనారాయణునిఁ జేరినపు డాతని—

క. అమ్మగువ గనుంగొనియెన్
ముమ్మరముగఁ బట్టెనామములు మై నెల్లం
గ్రమ్మికొన నుట్టిఁ బెట్టిన
గుమ్మడికాయయును బోలెఁ గూర్చున్నతనిన్.

అని పరిహాసించినపద్యముకంటె మల్లనకవి చెప్పిన యీక్రిందిపద్యమే సరసముగా నున్నది.

చ. వనిచినగుజ్జుమావి కెలనం దగుగందపుమ్రానికొమ్మలం
బెనఁగొనియున్న మల్లికలపెక్కువ గన్గొని నీళ్ళుగట్టి సం
జనితకుతూహలాంకురము శాఖలువాఱఁగ వచ్చుచున్నయ
మ్మునికులసార్వభౌముని ముముక్షువరేణ్యు మహానుభావునిన్.

దేవదేవి దాసరిసానివేషము, విప్రనారాయణుఁడు దేవదేవిని వెంబడించుటయు నిందు నందును గొంచె మెచ్చుతక్కువగా సమానముగానే సరసముగా వర్ణింపఁబడినవి. కాని, విటకంటకికి విప్రనారాయణుని దూషించుసందర్భమునఁ దమ్మకవి చెప్పిన—

"నీపక్కౌటిరువుణి నీతిరుచూర్ణంబు గణికకు వెండిబంగారు లగునె"

అనుపద్యముం బోలినపద్య మిందుఁ గనరాదు. ఆవిటకంటకియే తన గొప్ప చెప్పికొనుసందర్భమున మల్లనకవి చెప్పిన—

"కడుబట్టతలల మోఁకాళ్లను ముడివెట్ట నే నేర్తు మఱియును నే నె నేర్తు"

అనుపద్యముం బోలినపద్య మందును గానరాదు. ఇట్లే పరిశీలింపఁగా నేవో కొన్ని మెఱుఁగులు, కొన్నిలోపములు నిందు నందును గానవచ్చును గాని మొత్తముమీఁదఁ బరికింపఁగాఁ దమ్మకవికంటె మల్లనకవియే యౌచిత్యమున కెక్కువ పాటు పడె ననుట నిశ్చయము.

ఒక టేకథ గలిగినరెండుగ్రంథముల నొకదానితో నొకటి పోల్చి పరిశీలించునపు డిట్లే యేవో కొన్ని తారతమ్యములు కనుపట్టక పోవు. ఈదిఙ్మాత్రం బగువిమర్శన మైనను బ్రాచీన మయ్యు నవీనముగాఁ దలయెత్తుచున్న యీవిప్రనారాయణచరిత్రయందలి సారస్యమును లోకమునకుఁ దెలుపుటకొఱకే, కాని, యిదివఱకే లోకములో సుప్రసిద్ధ మైన వైజయంతీవిలాసంబునఁ గొఱంతలు గల వని తెలుపుటకుఁ గాదు.

—* కవిత్వము. *—

ఈకవి ప్రబంధపరమేశ్వర బిరుదాంకితుఁ డగు నెఱ్ఱాప్రెగడవంశములోని వాఁడయినందుల కీతని కవిత్వ మాపేరు నిలువఁబెట్టుటకుఁ దగినట్లుగా సరసజన

రంజకంబుగా లలితశైలిచే నిరర్గళధారచే నొప్పుచున్న దనుటకంటె వేఱుగా వివరింప నక్కఱ లేదు. ఆంధ్రకవులు సామాన్యముగా వాడినవే కాక యిందుఁ గొన్ని క్రొత్తకల్పనలు గూడఁ గలవు. ఇందుల కొక్కయుదాహరణము.

ఉ. ఎల్లజనుల్ పయోరుహభవేశ్వరవిష్ణుసయాత్ముఁడైనవాఁ
డల్లవికర్తనుం డనుచు నాడుదు రాతఁడు గాఁడు నేనసూ
తెల్ల మటంచు లోకులకుఁ దెల్పినరీతిని జంద్రునందు రా
గిల్లెను మేనిపైఁ బొడుపుఁగొంపును బాండిమముం గళంకమున్.

కథ లోకప్రసిద్ధ మగుటచే దీనిని దీనియందలి వర్ణనాదికమునుగూర్చి విస్తరించి వ్రాయ నక్కఱలేదు. కాని, యీకవి యితరశృంగార ప్రబంధకర్తలు కొందఱుం బలె నిందు గుహ్యాతిగుహ్యావయవవర్ణనాదికమును జుగుప్సాకరవర్ణనములను జేసియుండలే దనుటయు, నీతని కవిత్వము నిర్దుష్టమై ప్రామాణికముగాఁ దగియున్న దనుటయు నిందలి విశేషాంశము లని సంతసింపఁదగును.

—* గ్రంథముద్రణవిశేషములు. *—

ఈగ్రంథము ప్రతి యొక్కటియే పరిషత్తునకు లభించినది. దొరకిన ప్రతియైనను నడుమనడుమఁ గొంచెము శిథిలమై యున్నది. సాధ్యమైనంతవఱకు కాయాక్లిష్టభాగములను లేఖనదుష్టభాగములను సవరించి ముద్రించుటకై ప్రయత్నమొనరించితిమి. అం దందుఁ గుండలీకరణము చేయఁబడిన పదవర్ణవాక్యములు సందర్భానుసారముగాఁ బూరించితిమి. కవియభిప్రాయ మేమియుఁ దెలియని భాగములను జుక్కలు పొడిచి విడిచిపెట్టితిమి. మఱి కొన్ని తప్పు పాఠములను మూలమున సవరించి యాయపపాఠములను మాతృకలో నున్నట్లుగా నడుగు భాగమునఁ జూపితిమి. మాతృకలో లేనియర్ధానుస్వార శకటరేఫముల నిందుఁ జేర్చితిమి. కేవలలేఖనదోషములు సవరించుటతప్ప పాఠము దిద్దలేదు.

ఎట్లయిన రెండవప్రతి సంపాదింపవలయు నని యెంతో యత్నించితిమి. కాని, మాప్రయత్నము నెఱవేఱ దయ్యె. మల్లనకవి యెంతో శ్రమపడి

లోకోపకారకముగా రచియించిన యీగ్రంథముయొక్క జీవన మీ యొకప్రతి తోనే యుండుటచేతను, నదియు మిక్కిలి శిథిలావస్థకు వచ్చుచుండుటచేతను, నాంధ్రభాష కలంకారము గాఁదగిన యీ కావ్యమును ముందుగా నెట్లయిన ముద్రించుటయే మంచి దని యట్లు గావించినారము. ప్రథమముద్రణ మగుటను, ప్రతి యొక్కటియే యగుటను సంభవించిన ముద్రణలోపములను మన్నింప విద్వల్లోకమును వేఁడుకొనుచున్నారము. మఱియుఁ జిరకాల మీప్రతిని సంరక్షించి మాపరిషత్తున కొసంగిన చిత్తూరుజిల్లా పెద్దతిప్పసముద్రగ్రామనివాసు లగు మ. రా. తాళంకి వేంకటపతి గారి కెంతయుఁ గృతజ్ఞులము.

ఇట్లు, గ్రంథప్రకాశకులు,

జయంతి రామయ్య.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

# ద్వితీయముద్రణపీఠిక.



విప్రనారాయణచరిత్ర మాంధ్రసాహిత్యపరిమ త్ప్రచురణములలో మొద టిది. నేటికిరువదిమూఁడేండ్లక్రిందట వెలువడినది. ఇన్నియేండ్ల కయిన ద్వితీయ ముద్రణభాగ్య మీగ్రంథమునకు లభించినందులకు భాషాభిమానులు సంతసింప వలసియున్నది.

ఈగ్రంథమునకు మాతృక యొక్కటియే చిక్కినది. అదియైనఁ బరిష త్కార్యాలయమున "మేనేజ"రగు శ్రీ క్రొత్తపల్లి సూర్యరావుగారి మూలము ననే. చిత్తూరుజిల్లా పెద్దతిప్పసముద్రగ్రామనివాసులు శ్రీయుత తాళంకి వేంకట పతిగారొసంగిన తాళీదళసంపుటములలో నిది గలదు. తల, తోఁకయు లేక, చెల్లాచెదరుగాఁ బడియున్న తాళీదళసంపుటములలో నిమిడి యున్న యీ గ్రంథమును గుఱితించి గ్రంథభాగము నేర్చి కూర్చిన సూర్యరావుగారికిని, బరిషత్తువారికిని నాంధ్రలోక మెంతయేని కృతజ్ఞతఁ జూపఁదగును. వారు కని పెట్టకున్న నీగ్రంథమింకను గాలగర్భమున నడఁగి యుండెడిదియే.

ఈగ్రంథమును దొలుత ముద్రించినపుడు, పైని వివరించిన తాటియాకుల పుస్తకము ననుసరించి వ్రాయఁబడిన వ్రాఁతపుస్తకమే యాధారమైనది. వ్రాఁత ప్రతి నచ్చునకు సిద్ధము చేసినపుడు మాతృకకు విరుద్ధము లగు పాఠము లనేక ములు ప్రమాదమున దొరలినవి. ద్వితీయముద్రణమున నీపాఠము లెంతయో శ్రద్ధతో మూలతాళపత్రసంపుటముతో సంప్రతింపఁబడి సరిచేయఁబడినవి. చూడుఁడు—

"చాతురీరీతి వేర్వేఱ సంగ్రహించి
వనిత యొక జీనిపావడ వాని మీఁద
ముసుఁగువడఁజుట్టి పైలకముద్రఁ బెట్టి
యొఱలుగనకుండ నలుదిక్కులరసి చూచి,"

ద్వితీయముద్రణమున.

"ముసుంగుకడంజుట్టి పైలక్కముద్రఁబెట్టి" 2-87.

తొలికూర్పునఁ గల "పైలకముద్ర" కెంతయర్థము లేదో మలికూర్పునఁ గల "పైలక్కముద్ర" కంతయర్థము గలదు. కథాసందర్భము ననుసరించి దేవదేవి విలువగల తనవస్తువులను దనవిగా గుర్తించుటకును, దొంగలబాధ లేకుండుటకును లక్కముద్రవేసి యుంచినది. నేఁడు విలువగలవస్తువుల నొకచో దాఁచినపుడును బైకిఁ బంపునపుడును "లక్కసీలు" చేయు నాచారముగలదు. నాఁడును గలదు.

"క్రొన్ననవిచ్చులాగు వినిపించె న్మాధురీవైఖరిన్"

ద్వితీయముద్రణమున-

"క్రొన్ననయిచ్చులాగు వినిపించెన్" 3-82.

కథాసందర్భము పారిజాతప్రసూనము నొసఁగుట గావున ద్వితీయ ముద్రణపుఁ బాఠము సరియైనది.

"మఱియు దొరకిన" 4-3.

"మఱియు దొంకెన"—ద్వితీయముద్రణము=డొంకెన.

"ఆమహాబ్రహ్మచారి. 4-82. "ఆదిమబ్రహ్మచారి."

ఇచ్చట శ్రీమహావిష్ణువుంగూర్చినప్రసంగము గావున నాతఁడు వామ నావతారమున బ్రహ్మచారి గావున నాదిమబ్రహ్మచారియను పాఠము శ్రేష్ఠము.

| ప్రథమముద్రణములో. | ద్వితీయముద్రణములో. |
|---|---|
| ఇందీవరనేత్ర—2-42 | ఇందీవరనేత్రి |
| చకోరనేత్ర—3-7 | చకోరనేత్రి |
| వికచోత్పలనేత్ర—4-8 | వికచోత్పలనేత్రి |

ఇందీవరనేత్ర మొదలగు శబ్దములు మూలమునఁ గమలనేత్రి, జలరుహ నేత్రి, యిత్యాదిగా నికారాంతరూపములు గలవు. ఇవి యపాణినీయ స్త్రీలింగ

రూపములైనను ప్రాచీనాంధ్రభాషాసంప్రదాయము ననుసరించి సాధువులే. ప్రాచీనశాసనములలో (సోమలదేవి దాక్షారామశాసనము మున్నగువానిలో) నేత్రిరూపములే గలవు.

చిన్నన్న ద్విపద పరమయోగివిలాసములో:—
"తోయజదళనేత్రి తోయధిపుత్రి!"

అని యనుప్రాసమునఁగలదు. ఈశబ్ద మపశబ్ద మని కాంబోలును బరిష్కర్తలు ప్రశ్నార్థకచిహ్నము నుంచినారు. చూడు ౧ పుట-

రెండవప్రతి దొరకమిఁ గొన్నిపాఠము లిప్పటికిని నష్టే విడువఁబడినవి. పరిశీలింప నీద్వితీయముద్రణము మొదటిదానికంటెఁ జాల నిర్దుష్ట మని చెప్పనొప్పును.

—: కవివంశాదికము. :—

ఆంధ్రవాఙ్మయమునఁ గవిత్రయములోని వాఁ డని ప్రఖ్యాతిఁ జెందిన యెఱ్ఱాప్రెగడ వంశములోనివాఁ డగు మల్లనకవి దీనిని రచియించినాఁడు. మల్లన ఆర్వేలనియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. శైవాచారసంపన్నుఁడు. లింగనకుఁ గామాక్షికిని బుత్రుఁడు. (1-17) ఈతఁడు తనవంశక్రమమును దనముత్తాతనుండి యిట్లు వర్ణించియున్నాఁడు.

మల్లన-
|
ఎఱ్ఱన-
|
లింగన—కామాక్షి-
|
మల్లన—గ్రంథకర్త.

గ్రంథమున నెఱ్ఱాప్రెగడనుండి వంశక్రమమును దెలుపక యాతనిం దన వంశకర్తగాఁ దెలిపినాఁడు. (1-13) ఆవంశములోని వాఁడ నని సూచించుటకు "చిన్నిమనుమఁడ" నని వ్రాసికొనినాఁడు. (1-12)

మఱియు నెఱ్ఱాప్రెగడ తనగురువుగా, నృసింహపురాణ హరివంశకృతులలోఁ బ్రస్తుతించిన శంకరస్వామిని—

“మామకాన్వయ దేశికస్వామి యైన, శంకరస్వామి సంయమీశ్వరుఁ భజింతు”

అని ప్రత్యేకముగా నాశంకరస్వామిని మల్లన కృష్ణావతారికయందుఁ బ్రశంసించినాఁడు. ఎఱ్ఱాప్రెగ్గడ యందలి భక్తిగౌరవములు మాఱుపడకుండ నాశ్వాసాంత్యగద్యములయందు నెఱ్ఱాప్రెగడగద్యలయందువలె “శ్రీశంకరస్వామి సంయమీశ్వరచరణసరోరుహధ్యానసం. సౌందర్యభూష్య” అని మొదలిడినాఁడు.

పైని గ్రంథస్థవిషయములఁ బరిశీలింపఁగ విగ్రయములోని యెఱ్ఱాప్రెగడ మల్లనకవికిఁ బూర్వుఁడని మనకుఁ దెలియుచున్నది. మల్లనకవి క్రీ. శ. 1600 వ సంవత్సరప్రాంతమువాఁడును, ఎఱ్ఱాప్రెగడ క్రీ. శ. 1360 సంవత్సరప్రాంతము వాఁడు నగుట పైవిషయముననే స్థిరపడుచున్నది. గ్రంథావతారిక యందు (1-21) “ఎఱ్ఱప్రెగ్గడ మనుమఁడ వనఘుఁడవు నీవు మల్లనసుకవీ” యనుచో నచ్చటి సందర్భమునను సరించి యెఱ్ఱాప్రెగడ యాతనితాత యైన యెఱ్ఱాప్రెగడ గాని ప్రబంధపరమేశ్వరుఁ డగు నెఱ్ఱాప్రెగడ కాఁడు, కావున నీతఁడు ప్రబంధపరమేశ్వరునికి సాక్షాత్పౌత్రుఁడు గాక యాతని వంశములోనివాఁ డని మనకు స్పష్టముగఁ దెలియుచున్నది. మల్లన గద్యయందు, “శ్రీకాళహస్తీశ్వరదయాసహాయ” అని చెప్పుకొని యుండుటచే నాతఁడు శ్రీకాళహస్తి నివాసుఁ డని యూహింపఁదగి యున్నది.

మల్లన యింటిపేరు వదలువాడవారు. కావున నాతని వంశకర్త యగు నెఱ్ఱాప్రెగ్గడ యింటిపేరు గూడఁ జదలువాడవారని యీగ్రంథమువలననే తెలియవచ్చుచున్నది. భారతారణ్యపర్వశేషమున నెఱ్ఱాప్రెగడ తనకుఁ బాకనాఁటిలోని నీలకంఠేశ్వరస్థాన మైన గుడ్లూరు నివాస మని చెప్పుకొనినను మొదట గుడ్లూరునందుండి యావెనుక గుడ్లూరునకు సమీపమున నుండు చదల్వాడ యందు స్థిరనివాస మేర్పఱచికొని యుండును. కావున, మల్లన, “చదల్వాడ నిలయు నాదువంశకర్త” అని చెప్పినాఁడు. ప్రసిద్ధులగు నాంధ్రకవులు చదలు

వాడ యెఱ్ఱాప్రెగడ యని వాడినారు. కవిసార్వభౌముఁ డగు శ్రీనాథుని శిష్యుఁడును బావమఱఁదియు నగు దగ్గుపల్లి దుగ్గన తన నాసికేతోపాఖ్యానమున "చెదలువాడ యెఱ్ఱయకవిశ్రేష్ఠుఁ గొలుతు" ననియు, నుత్తరనారసింహపురాణావతారికయందు హరిభట్టుకుమారుఁడు రాఘవమనీషి "నారసింహపురాణపౌరస్త్యభాగంబు చెదలువాడెఱ్ఱయ మొదలు సేయు" ననియు నెఱ్ఱాప్రెగడను బ్రశంసించినారు. అయినను బరిషత్తువారీగ్రంథమును బ్రకటించిన తరువాతనే యెఱ్ఱాప్రెగడయింటిపేరు చదలువాడవారని స్పష్టముగఁ దెలియవచ్చినది. వీరేశలింగముపంతులుగారు తాము కవులచరిత్రము ప్రథమభాగపుఁ బునర్ముద్రణమున నీవిప్రనారాయణచరిత్రము ననుసరించియే యెఱ్ఱనయింటిపేరు చెదలువాడవా రని వ్రాసియున్నారు. భాషావాఙ్మయవిమర్శకు లీతరువాత నీగ్రంథము ననుసరించియే యెఱ్ఱాప్రెగడ యింటిపేరు చెదలువాడవా రని వ్రాసియున్నారు.

"చదలుహాడకు," "చెదలువాడ" యని రూపములు తాళపత్రగ్రంథములయందుఁ గానఁబడుచున్నవి పరిశీలింప 'చెదలువాడ' యను రూపముఁ గూడఁ బ్రాచీనకవిప్రయోగముల ననుసరించి సాధువే యగును. దగ్గుపల్లి దుగ్గన "చెదలువాడ యెఱ్ఱయకవిశ్రేష్ఠు" అను పద్యపాద మీవఱ కుదాహరించినాఁడను. మఱియుఁ గుమారభారతి రామలింగకవి యుద్భటారాధ్యచరిత్రమున

"చెదలువాటీపుర శ్రీరఘూద్వహాభుజాస్తంభరక్షణవిధాసంభృతంబు"-

అని చెప్పియున్నాఁడు. రెంటియందును 'చెదలువాడ' యను రూపము మార్పరాని యతిస్థానమున నిబద్ధమై యుండుటచే నీరూపముకూడ గ్రాహ్యమే. కాని యీనడుమ పదునొకొండేండ్ల క్రిందట కీర్తిశేషులైన ప్రసిద్ధపండితులు చదలువాడ సుందరరామశాస్త్రిగారు తాము రచియించిన ఆదిత్యస్తవమునఁ దమగృహనామమును "ఖవాటాన్వయేన" అని సంస్కృతీకరించినారు. పందిపాడునకు "క్రోలాచల" మనినట్లు "నడిమింటి"కి "మధ్యమందిర"మని "చిలుకమఱ్ఱికి" "శుకవట" మనినట్టులు "చదలువాడకు" "ఖవాటి" మని వారు వాడినారు. అట్లయినఁ జదలువాడ యని యుండఁ దగును ఖ=చదలు, వాటిక=

వాఁడ, యను వ్యుత్పత్తి ననుసరించినచో రెండురూపములును గ్రాహ్యములే యగుచున్నవి.

## —: కవికాలము. :—

మల్లనకవి యీగ్రంథమును సాళువమాకరాజు కుమారుఁడు తిరుమలరాజున కంకితముగా రచియించి యున్నాఁడు. సాళువవంశీయులు ప్రస్తుతము చిత్తూరుజిల్లా యందలి కార్వేటినగరసంస్థానమును బరిపాలించినరాజులు. ఈ సాళువ యనునామము తొలుత బిరుదముగా నేర్పడి యావెనుక గృహనామముగా మాఱినది. కర్ణాటాధీశు లగు విజయనగరరాజులలో సాళువ నరసింహరాజువలన నీబిరుదము వీరికి సంక్రమించినట్లు తెలియుచున్నది. విజయనగరసాళువ వంశమునకు సంబంధించిన "మేదినీమీసరగండ" "ధరణీవరాహ" "చాణూరమల్ల" "కఠారిసాళువ" మున్నగు బిరుదము లీవంశీయుల కున్నట్లు విప్రనారాయణచరిత్రమువలననే తెలియుచున్నది. మఱియు "కర్ణాటాధీశదత్తోత్కటవివిధమణీభూషణముల" కాంతి యాస్థానము నిండినట్లు మల్లన వర్ణించుటచే నీబిరుదము సాళ్వనరసింహరాజప్రసాదితమే యని యూహింపవచ్చును.

విప్రనారాయణచరిత్రరచననాఁటికి సాళువరాజులు కార్వేటినగరమునకుఁ జేరువనున్న నారాయణవనమును బరిపాలించుచుండిరి. ఈనారాయణవనమునందు, కల్యాణవేంకటేశ్వరస్వామివారి యాలయమున, పైగోపురముమీఁది యొక శాసనమువలన మనకు విప్రనారాయణ చరిత్రకృతిపతి యగు తిరుమలరాజు కాలమును గృతికర్త యగు మల్లనకాలమును స్పష్టముగఁ దెలియుచున్నవి. ఈశాసనము శాకాబ్దములు ౧౫౪౪ అనఁగా క్రీ. శ. 1622 సంవత్సరమునాఁటిది.[1] కావున క్రీ. శ. 1600 సంవత్సరప్రాంతమున మల్లనకవి యున్నవాఁ డని స్పష్టమే.

ఈకృతిరచననాఁటికి, కార్వేటినగర మింకను నిర్మింపఁబడలేదు. కార్వేటినగరనిర్మాణము తొలుత వేంకటపెరుమాళ్లరాజు కాలమునఁ బ్రారంభింపఁబడి వెనుకఁ గార్వేటిరాజు కాలమునఁ బూర్తిగావింపఁబడినది. కార్వేటి

1. South Indian Inscriptions.

రాజు కుమారుఁడు కసవరాజునకు ఋగ్వేదికవి వేంకటాచలపతికవి తనచంపూ రామాయణమును గృతియొసఁగినాఁడు. విప్రనారాయణచరిత్రమున సాళువరాజుల వంశక్రమము చక్కఁగాఁ దెలియవచ్చుచున్నది. వంశక్రమమును జూడఁదగును.

ఇంతవఱకు నీగ్రంథము కార్వేటినగర చరిత్రకారుల దృష్టిపథమునఁ బడలేదు. ఈయవతారిక చరిత్రాత్మకముగాఁ బరిశీలింపఁ దగియున్నది. ఈరాజులందఱును భాషాపోషకులు- ఇందు లక్ష్మీపతిరాజు సంవరణచరిత్రమును జెప్పించుకొనినట్లు మల్లన చెప్పియున్నాఁడు. ఈకృతి యిప్పుడు లభించుటలేదు. ఇదియు మల్లనకృతమే కావచ్చును.

మల్లన తనగ్రంథమునఁ దాను ద్విపదరుక్మాంగదచరిత్రమును రచించినట్లు (1-21) చెప్పుకొనినాఁడు. ఈకృతి మనకుఁ బూర్తిగ లభింపలేదుగాని యిందలి రెండుపాదములు, అప్పకవి, తనయప్పకవీయమునఁ దృతీయాశ్వాసమున నుదాహరించినాఁడు.

"శ్రీకరగుణసాంద్ర చిరయశోరుంద్ర
యాకారచంద్ర రామయభాస్కరేంద్ర"

ఇది రామయభాస్కరునికిఁ గృతిగాఁ జెప్పినట్లు పైని ద్విపదపాదము వలనఁ దెలియుచున్నది. ఈరామయభాస్కరుఁడు మల్లనకాలమునఁ బ్రఖ్యాతిం జెందినవాఁడు. ఈతఁడును ముందు నేనుదాహరించిన శాసనమునఁ బేర్కొనఁబడియున్నాఁడు.

అప్పకవి క్రీ. శ. 1656 సంవత్సరప్రాంతమువాఁడు గావున మల్లన 1600 సంవత్సర ప్రాంతమువాఁడు గావునను అప్పకవి యుదాహరించిన గ్రంథము మల్లనకవికృతమే యని యూహింపఁదగి యున్నది.

విప్రనారాయణచరిత్ర మైదాశ్వాసముల ప్రబంధము. గ్రంథపాతము లచ్చటచ్చట నున్నను ముద్రితగ్రంథమున 463 గద్యపద్యములు గలవు. గ్రంథపాతములైనను వర్ణనభాగమందేగాని కథాసరణి కద్భుతగులు ఘట్టములు లేవు. ఇందు వర్ణిత మైన కథ తొండరడిప్పొడియాళ్వా రను విప్రనారాయణుని చరి

త్రము. ఈతొండరడిప్పొడిపదవ్యుత్పత్తిని వైజయంతీవిలాసకారుఁ డిట్లు చెప్పినాఁడు.

"భక్తులకుఁ దొండ రఁఘ్రిశబ్దమున కడియు
రేణునకుఁ బొడి యనియు నీరీతి ద్రవిడ
భాషఁ బరఁగుటఁ జేసి తద్భావ జనము
లతనిఁ దొండరడిప్పొడి యండ్రు భువిని. (1-35)

ఈతొండరడిప్పొడియాళ్వారను ద్రవిడనామమునకు భక్తాంఘ్రిరేణువని సంస్కృతము.

వైష్ణవసంప్రదాయమునఁ బన్నిద్దఱాళ్వారు లనియు, దివ్యసూరు లనియు నిత్యసూరు లనియును నెన్నికను గన్న భక్తులలోఁ దొండరడిప్పొడియాళ్వారొకరు. "ఆళ్వారు" అను పదమునకు "ప్రభువు, లేక, రక్షించువాఁడు" అని యర్థము. విశిష్టాద్వైతమతసంప్రదాయప్రవర్తకు లగు శ్రీరామానుజులకుఁ బూర్వమీయాళ్వారులు వైష్ణవభక్తిని నెలకొల్పినవారు. ఈయాళ్వారులును ద్రవిడదేశోత్పన్ను లగుటచే వారి ద్రావిడాహ్వాయములను సంస్కృతాభిధానముల నీక్రింద వివరించుచున్నాఁడను.

| సంస్కృతము. | ద్రవిడము. |
|---|---|
| 1. భూతయోగి— | పూదత్తాళ్వారు |
| 2. సారయోగి— | పోయిగైయాళ్వారు |
| 3. మహాయోగి— | పేయాళ్వారు |
| 4. భక్తిసారయోగి— | తిరుమలీశాళ్వారు |
| 5. శఠకోపయతి— | నమ్మాళ్వారు |
| 6. మధురకవి— | |
| 7. కులశేఖరాళ్వారు— | |
| 8. విష్ణుచిత్తుఁడు— | పెరియాళ్వారు |
| 9. గోదాదేవి— | ఆండాళ్ |
| 10. భక్తాంఘ్రిరేణువు— | తొండరడిప్పొడియాళ్వారు |
| 11. పరకాలయతి— | తిరుమంగైయాళ్వారు |
| 12. యోగివాహయతి— | తిరుప్పాణాళ్వారు |

# వంశవృక్షము.

- పాకము రాచిరాజు
  - తిప్పరాజు
    - ముమ్మడిరాజు
      - పెదమాకరాజు
      - ఎఱ్ఱమాకరాజు
        - కుమారమాకరాజు
          - శ్రీరంగరాజు
      - లక్ష్మీపతిరాజు
      - ముమ్మడిరాజు
        - రాచమదేవి (భార్య)
          - ఎఱ్ఱమాకరాజు
          - వెంగళరాజు
            - లక్ష్మీపతిరాజు
            - తిప్పరాజు
        - తిరుమలాంబ (1) (భార్య)
          - బొట్టుమాకరాజు
          - రఘుపతిరాజు
      - ఎఱ్ఱరాజు
      - తిమ్మరాజు

ముమ్మడిరాజు(1) తిరుమలాంబ

వీరిలో మధురకవి, కులశేఖరులకు ద్రావిడనామములు లేవు. ఈయాళ్వారులు క్రీ. శ. 5వ శతాబ్దమునుండి 8వ శతాబ్దము వఱకు విలసిల్లి యుండిరని చరిత్రకారులు నిర్ణయించినారు.

ఆంధ్రవాఙ్మయమున నీయాళ్వారుల చరిత్రములలో విప్రనారాయణుని కథ యొక్కటి పండితపామరసమాదరణీయమై యున్నది. కేవలప్రబంధరీతిని గాక నాటకములయందును, నేఁటి "టాకీ" ప్రదర్శనములయందును నీకథ ప్రసిద్ధిఁజెందుటయే లోకమున నిదియెంత ప్రచారములోనికి వచ్చినదియుఁ దెలుపుచున్నది.

ఈపన్నిద్దఱాళ్వారుల చరిత్రములను దెలుపు గ్రంథములలో 'దివ్యసూరి చరిత్ర' మను సంస్కృతగ్రంథము ప్రాచీనము. ఈగ్రంథకర్త శ్రీరామానుజుల సమకాలికుఁడు. రెండవది, గురుపరంపరాప్రభావము. ఇది సంస్కృతద్రావిడ మిశ్రమగు మణిప్రవాళశైలిని రచియింపఁబడినది. గ్రంథరచనకాలము, 14-వ శతాబ్ది. పిమ్మటిది మనవాళ మహామునిరచిత మగు "ఉపదేశరత్నమాల" యను సంస్కృతనామముగల ద్రావిడభాషాగ్రంథము. ఇదియు క్రీ. శ. 14-వ శతాబ్దిని రచియింపఁబడినది. దీనితరువాతిది ప్రపన్నామృత మను ప్రఖ్యాతిఁ జెందిన మఱియొక సంస్కృతగ్రంథము. ఇది 1554-1614 వఱకుఁ బాలించిన వేంకటపతిరాయల కాలమున రచితమైనది.

ఆంధ్రవాఙ్మయమున నీయాళ్వారులచరిత్రములు పరమయోగివిలాస మను పేరఁ బరఁగుచున్నవి. వీనిలో మొదటిది- తాళ్లపాక చిన్నన్నకృత మగు పరమయోగివిలాసము ద్విపదకావ్యము- చిన్నన్న విజయనగరరాజులలో సదాశివరాయల కాలమువాఁడగుటచే, క్రీ. శ. 1545వ సంవత్సరప్రాంతమువాఁడు. కావున ద్విపదపరమయోగివిలాస మా కాలమునాఁటిది. విప్రనారాయణుని కథ యీద్విపదకావ్యమున నాల్గవయాశ్వాసమునఁ గలదు.

రెండవది సిద్ధిరాజు తిమ్మరాజకృత మగు పద్యకావ్యము. తిమ్మరాజు, అళియరామరాయని మేనల్లుఁడు. ఈతఁడు క్రీ. శ. 1564వ సంవత్సరప్రాంతములఁ గొండవీటిని బరిపాలించినవాఁడు కావున, చిన్నన్నద్విపదకావ్యమును

జూచి పద్యకావ్యముగా రచియించియున్నాఁడు. ఇందు విప్రనారాయణుని కథ తృతీయాశ్వాసమున 180–309 పద్యములవఱకుఁ గలదు.

ఈకథను ప్రత్యేకప్రబంధములుగా రచియించినవారిలో మన మల్లనకవి తొలివాఁడు. తరువాత నీకథను వైజయంతీవిలాస మనుపేర రసవత్ప్రబంధము గా సారంగు తమ్మయకవి రచియించినాఁడు. ఈతఁడు క్రీ. శ. 1581–1611 వఱకు గోలకొండయందు రాజ్యముచేసిన మహమ్మదుశాహా కాలములోనివాఁడు కావున, మల్లనకవికిఁ గొంచెము తరువాతివాఁ డని యూహింపఁదగును.

ఇదియుంగాక పిడుగు వేంకటకవి యనునాతఁడు దీనిని మూఁడాశ్వాస ముల ప్రబంధముగా రచియించియున్నాఁడు. కవి యధునాతనుఁడు. గ్రంథమ ముద్రితము. తంజావూరు సరస్వతీమహాలు పుస్తకభాండాగారములో నున్నది.

పైని వివరించిన మూలగ్రంథములయు నాంధ్రగ్రంథములయుఁ బౌర్వా పర్యవిచారము చేయఁగా మల్లనకవి చిన్నన్నకృత మగు పరమయోగివిలాసము ననుసరించె నని స్పష్టమగుచున్నది. మల్లన తిమ్మరాజకృతమగు పద్యకావ్యమును జూచిన ట్లీ రెండుగ్రంథములను జదువఁగా గోచరించుటలేదు. వైజయంతీవిలా సకారుఁడు పై మూఁడుగ్రంథములను జదివినట్లు గ్రంథమునందలి యాయాసంద ర్భములఁ జేసినమార్పులు చెప్పుచున్నవి.

మఱియు నీకథకు మూలభూతము లగు గ్రంథములలోఁ బ్రపన్నామృత మను సంస్కృతగ్రంథమును మల్లనకవి చూడ నేలేదని చెప్పనొప్పును. ప్రపన్నా మృతగ్రంథకర్త వేంకటపతిరాయల కాలమువాఁడు గావున మన మల్లనకు సమ కాలీనుఁడుగాని కొంచెము వెనుకవాఁడుగాని కావచ్చును. ప్రపన్నామృతమున నీకథ 93–94 అధ్యాయములలోఁ గలదు. దానిని మల్లనకవిగ్రంథముతోఁ బోల్చి చదివినపుడు మల్లన దాని ననుసరింప లేదని స్పష్టముగాఁ గానవచ్చినది. వైజ యంతీవిలాసకారుఁడు ప్రపన్నామృతము నాధారముగాఁ జేసికొని తనగ్రంథ మునఁ గొన్నిమార్పులు కావించె నని రెండుగ్రంథములను జదివినవారికిఁ దోఁ చును. ద్విపదపరమయోగివిలాసమునఁ జిన్నన్న తాను సంస్కృతగ్రంథ మగు దివ్యసూరిచరిత్రము గాక ద్రావిడగ్రంథమును జూచి రచియించినట్లు–

"పనుపడ ద్రవిడప్రబంధంబుఁ జూచి,
తెనుఁగున రచియింపు ద్విపదరూపమున"

అని శ్రీవేంకటేశ్వరుఁడు తన కానతి యిచ్చినట్లు చెప్పియున్నాఁడు, కావున, నాఁడ్రకథారచనములోఁ జిన్నన్న కథనమే ప్రమాణ మని యెన్నఁదగును. వైజయంతీవిలాసమున విప్రనారాయణచరిత్రమున నీవిషయము చక్కఁగ నెఱుకపడును గావున దాని నిట వివరించెదను.

| విప్రనారాయణచరిత్రము. | వైజయంతీవిలాసము. |
| --- | --- |
| 1. చోళదేశము-మండంగుడి యందు విప్రనారాయణుఁడు జన్మించుట. | 1. శ్రీరంగపుర వర్ణనము. అందు విప్రనారాయణుని జననము. |
| 2. ఇందు మూలమునకు విరుద్ధముని పల్లన వసంతర్తువర్ణనముఁ జేయలేదు. | 2. వసంతఋతువర్ణనము. |
| 3. దేవదేవిచరిత్రము. వేసవి వర్ణనము. | 3. వేసవివర్ణనము. దేవదేవి చరిత్రము. |
| 4. దేవదేవియు మధురవాణియు, విప్రనారాయణుఁడు తమ్ముఁ లెక్కసేయక కన్నెత్తియైనఁ జూడలేదని యతనిపైఁ బంతము వేసికొనుట. | 4. దేవదేవి విప్రనారాయణునకు ప్రమొక్కఁగను నాతఁడు వారిని లెక్కసేయకుండుట. |
| 5. దేవదేవియు, విప్రనారాయణుఁడును వేర్వేఱు కుటీరముల యందుండుట. | 5. దేవదేవియు విప్రనారాయణుఁడు నొకకుటీరముననే నివసించుట. |
| 6. విప్రనారాయణుఁడు దేవదేవీసమాగమమున ధీరనాయకుఁడుగా వర్ణింపఁబడుట. | 6. విప్రనారాయణుఁడే తొలుత దేవదేవీసమాగమమును గాంక్షించుట. |
| 7. శ్రీరంగనాథుఁడు బ్రహ్మచారియై వచ్చినపుడు తనపేరు కాంతోపయంతుఁ డని చెప్పుట. | 7. శ్రీరంగనాథుడు తనపేరు రంగనాథుఁ డని తెలుపుట. |

8. విప్రనారాయణునిభక్తి సహజవై రాగ్యముల వర్ణనము. అతని ప్రాబోధకీస్తుతి, శ్రీమాలికారచనము.

8. ఔచితినిమీఱిన శృంగారవర్ణనము. ప్రాబోధకీస్తుతి, శ్రీమాలికారచన ప్రసంగము నిందులేవు.

కథాభాగమున మల్లనకవికృతగ్రంథమునందుఁ గల వైభేదము లన్నియుఁ జిన్నన్నపరమయోగివిలాసముననే యుండుటయు, తిమ్మరాజుగ్రంథముకూడ నొకటి రెండు చోటులఁ దక్కఁ దక్కినహానియందు వైజయంతీవిలాసము ననుసరించి యుండుటయుఁ జూడఁ గల్లన చిన్నన్నపరమయోగివిలాసకథనే కైకొని ప్రత్యేకముగఁ బద్యకావ్యముగా రచియించె నని నిర్ధారింపఁ దగి యున్నది.

మల్లన కథారచనమున విప్రనారాయణుని సహజభక్తివైరాగ్యములు దృఢచిత్తమును దొలినుండి చివరవఱకును జక్కఁగఁ బ్రదర్శించి పాత్రపోషణము గావించినవాఁడు. ప్రథమాశ్వాసమున నాల్గుయిదు పద్యములలో నీతనివైరాగ్యము వర్ణించి యాయాశ్వాసముఁ బూర్తి గావించినవాఁడు. ద్వితీయాశ్వాసమున, విప్రనారాయణుఁడు శ్రీరంగనాథుని శ్రీమఠటాంతరీపమునఁ బువ్వులతోఁటను నిర్మించుసమయమున నాతనిభక్తిని-

సీ. లుబ్ధకాద్భుతసిత స్తబ్ధరోమాకృతిఁ
దలపోయుచును నేల త్రవ్వి త్రవ్వి
సింధుగర్వహాపం క్తికంధరారిధ్యాన
కలితుఁడై కట్టలు కట్టికట్టి
యందమొందఁ గళిందనందినీ భేదికిఁ
దెలుచుచుఁ గాలువల్ దీర్చితీర్చి
చక్రిత్రివిక్రమచక్రమక్రీడలు
గొనియాడుచును మళ్లు గొలిచికొలిచి
మిట్టు పల్లంబు లెల్లను మెలపుతోడ
సరసి నాలుగుమూలలుఁ జదునుగాఁగ

నేర్పుతో నాలవాలంబు తేర్పరించి
తమిని నానాఁటికిని వాని తతియొఱింగి. (2-21)

ఇందు శ్రీమహావిష్ణువు వరాహ, శ్రీరామ, పరశురామ, వామనావతారములు సూచింపఁబడినవి. మఱియు, నేలత్రవ్వుట, కట్టలు గట్టుట, కాలువలు తీర్చుట, మళ్లు గొలుచుట, మున్నగు నారామనిర్మాణవిశేషములు భగవంతుని లీలలుగా నెఱింగి యాతనికి నిండారుభక్తిపరతచే సేవఁజేయఁబూనిన విప్రనారాయణుని భక్తి ద్యోతక మగుచున్నది. విప్రనారాయణుని దృఢచిత్తము, గాలివానసమయమున నట్టిక నకుశేయి నాతనింటియందు నెలజవ్వనపు బోగముచాన నిలిచిన సమయమున నాతఁడు చెప్పిన "సీ. తడికాళ్లతోఁ ద్రొక్కఁదవుచుమీయిదె కుశాస్తరణ మాత్మధ్యానసమయమయ్యె" (3-77) అను మాటవలన నాతని చిత్తమప్పటివఱకు నొకించుక యేని జలింపలేదని తెలియుచున్నది. సహజవైరాగ్యసంపన్నుఁడు, పరనారీపరాఙ్ముఖుఁడు గావుననే తాను బదుపుటింతినని చెప్పుకొనినను దేవదేవీదాస్యమున కంగీకరించినవాఁడు. మఱియు నొకసంవత్సరమున్నను దేవదేవి యతనిని వంచింపలేక వగచుటయు నాతని హృదయపటుత్వమును దెల్పుచున్నది. వైజయంతీవిలాసకారుఁడు, విప్రనారాయణుఁడు దేవదేవికిఁ దొలుతఁ దన మనోరథమును సూచించినట్లు వర్ణించి యాతని శీలమును భంగముచేసినాఁడు.

శృంగారరసవర్ణనమైనను, మల్లన, తమ్మయ్యవలెను, గొందఱు దాక్షిణాత్యకవులవలెను మిక్కిలిగాఁ గావింపక యెంతయు నుచితముగా నొనర్చినాఁడు. దేవదేవీసమాగమఘట్టమున సంభోగశృంగారము, వైజయంతీవిలాసమున నత్యుత్కృటముగాఁ గావింపఁబడినది. వేశ్యమాత విప్రనారాయణుని నిల్లు వెడలఁగొట్టు సమయమున నాతని విరహావస్థను తమ్మయకవి, దేవదేవి శృంగారచేష్టలను దలపోసి గళితధైర్యుఁ డైనట్లు వర్ణించినాఁడు. మల్లన నాయకుని శీలము ననుసరించి 'మన్మథశరావిద్ధమానసుఁ' డయ్యెనని మాత్రమే వర్ణించినాఁడు. మల్లనకవి విప్రనారాయణుని కృతులను శ్రీమాలికను, ప్రాబోధకీస్తుతిని పేర్కొనినాఁడు. ఇవి వైష్ణవులు నిత్యానుసంధానము చేయుదురు. ఈ రెండింటియందు

భక్తిరస ముట్టిపడుచుండును. వైజయంతీవిలాసమున నీవిషయమే తెలుపఁబడి యుండలేదు. ఈరీతిని మల్లనగావించిన పాత్రపోషణ మెంతయుఁ బ్రశంస్యమై యున్నది.

మల్లనకవి సరసమగు కవితాధార గలవాఁడు, ప్రబంధపరమేశ్వరుని వంశములోనివాఁడై యాపేరు నిలుపుకొనఁదగిన ప్రతిభాసంపత్తి గలవాఁడు. మల్లనకృతు లితరము లేవియు మనకు లభింపకపోయినను నాతనికవితావైదుష్యమునుఁ బ్రకటించుట కీవిప్రనారాయణచరిత్ర మొక్కటియే చాలును. ఆంధ్రప్రబంధములలోఁ బెద్దనార్యుని మనుచరిత్రమునందీతని కధికాదరమున్నట్లు ద్వితీయాశ్వాసమున శ్రీరంగపురవర్ణనమున "స్వారోచిషమనుసంభవంబును, బోలె వరూథినీప్రధానంబును" అని ప్రత్యేకముగఁ జెప్పినాఁడు.

"సీ. బుద్ధీంద్రియక్షోభములకుఁ బెట్టనికోట" అను పద్యము ననుసరించి మల్లన- "అనఘకుమారుణంబునకుఁ బెట్టనికోట" అని (1-84) వైరాగ్యమును వర్ణించినాఁడు. భారతమున నలోపాఖ్యానములోని "నలదమయంతు లిద్దఱు మనఃప్రభవానలదహ్యమానులై" యను పద్యమువలె "నెలఁతయుఁ దాను సంయమి తమి న్విహరించెఁ గవేరకన్యకాపులినతలంబునందు" అను (2-92) పద్యమున వర్ణించినాఁడు.

మఱియు మల్లన ద్వితీయాశ్వాసమున శ్రీరంగపురవర్ణనమున నశ్వములను "లలితోత్సాహములై ...నిచ్చలు కావ్యంబులనం జెలంగుఁ బురి నానానేయ గంధర్వముల్ (2-8) అని వర్ణించినాఁడు.

కావ్యములను, కవిరాజశిఖామణి నన్నెచోడుఁడు "మదనాగంబును బోలెఁ గ్రాలవలదా మాటెందు లేకుద్ధతిన్. అని గజముతోడను-

కవిలోకబ్రహ్మ పెదపాటి సోమనాథుఁడు- రథముతోడను, సామ్యముగా వర్ణించినారు. కావున, నిది నూతనము గాదు.

ఈరీతి నొండురెండు పట్టుల ననుకరణము లున్నను నపూర్వకల్పనము లిందు లేకపోలేదు.

చంద్రవర్ణనము—

ఉ. ఎల్లజనుల్ పయోరుహభ వేశ్వరవిష్ణుమయాత్ముఁ డైనవాఁ
డల్లవికర్తనుం డనుచు నాడుదు రాతఁడు గాఁడు నేననూ
తెల్ల మటంచు లోకులకుఁ దెల్పినరీతిని జంద్రునందు రా
గిల్లెను మేనిపైఁ బొడుపుఁ గెంపును బాండిమయుం గళంకముల్. (3-34)

విప్రనారాయణచరిత్రమును మల్లనకవి, తాను ప్రబంధపరమేశ్వరుని వంశములోనివాఁడ నని చెప్పికొనఁ దగినంత రసవంతముగఁ బ్రౌఢముగ రచించినాఁడు. ప్రబంధపరమేశ్వరునివలె సంస్కృతాంధ్రపదములను సమానముగ వాడుటయే గాక లోకోక్తులతోడను, జాతీయములతోడను కవితఁ గూర్చెను.

—లోకోక్తులు—

ఈఁగకునిసుఱుం బాముకుఁ బలియు-(3-16) కన్నుల ద్రొక్కి మనమున దీవిఁచినట్లు (4-68) వేశ్యతోఁ జెలికిఁ దీపంచును దిను (5-15) ఎద్దీనన నొందిగట్టుట (5-40) రాజానుమతో ధర్మః (5-63) మొకలైనవి సందర్భానుసారముగఁ బొందుపఱుపఁబడినవి.

—జాతీయములు—

ఊ చుక్కనిపించు—

ఇల నితరంపువాసనలనెల్ల నుచుక్కనిపించుచున్న దీ లలితలతాంతగంధము-(2-66)

చిక్కదమ్మఁడు—

తొయ్యలి చిక్కదమ్మఁడని దుర్భరవార్ధనిమగ్నచిత్తయై 3-9.

రాతికొడుకు—

గొంటు బాఁపఁడు తా రాతికొడుకువోలె (3-56)

పాముప్రేలఁగట్టినరేవన్—

ఘనములు—గురిసెం బాముప్రేలఁగట్టినరేవన్ 3-61

మూఁడుమెచ్చులును మెచ్చె—

అగ్రజాత, చెలియలిని నిట్లు మూఁడుమెచ్చులును మెచ్చె 4–12

(చూఁడుడు, విజయవిలాసము—మూఁడువలపుల్వలపించె-)

ముడుఁగుళ్లఁబోవు—

సఖులు ముడుఁగుళ్లఁబోయెదు సరణిఁజూచి- 4–16

దూఱుదుంకంబు—

కడదాఁక దూఱుదుంకంబులాడ- 4–19

నసగూఁటితనంబు—

కూరిమిపట్టి నిట్టి నసగూఁటితనంబు 4–25

వడ్డించుచో నీకు దిక్కెవ్వరు 4 61

నట్టిక నడురేయి చెప్పుట 4–66

తల్లి న్నార్లనుగ్గించి 4–77

కుడిచి కూర్చుండు 4–78

విప్రనారాయణచరిత్రమున నుపయోగింపఁబడిన కొన్ని పదములు నిఘంటువులయందుఁ గన్పట్టుట లేదు. బారాటిసేల (2–18) తక్కలితంబు (4–29) ఈనుల్పులు (5–62) మున్నగు దేశ్యము లిందుఁ గలవు. అళువాఱు, ఒఱదల, మున్నగు మాటలకు నిఘంటువుల నీగ్రంథమే ప్రమాణముగా గ్రహింపఁబడినది. గామిడిపదమునకు శ్రేష్ఠమను నర్థము నిఘంటువులలోఁ గలదు. "గామిడి" యనఁగా "చెడ్డ" యను నర్థముతో నీగ్రంథమునఁ బ్రయుక్తమైనది. నేఁడు వాడుకలో నున్న కాగితమును- కవి "కడకువ్రాయుంగఁ దెచ్చు కాగత మనంగ-" అని యతిస్థానమున వాఁడెను. తాయి, తావు, తేవ, చిట్టుములు మున్నగు మాటలు రెండుమూఁడు తడవలు వాడియుండుటచే నీకవికి వానియం దెక్కువ మక్కువ గన్పట్టుచున్నది. మఱియు, రికీబులు, హాజారము, కరాబి, సురధాణి, కర్తాఁడు మున్నగు నన్యదేశ్యము లచ్చటచ్చటఁ బొందుపడినవి.

మల్లనకవి శైవాచార్యుఁ డైనను వైష్ణవసాంప్రదాయిక మగు నీగ్రంథరచనమునఁ గేవలవైష్ణవుని రచనమును దలఁపింపఁ జేసినవాఁడు- తిరునాళ్ళు, తిరునాపుతిత్తులు, తన్నీరుదాసళ్ళు, తిరునామము, తిరుచూర్ణము, తిరువాముడి, తిరుమణి, తిరువుల్లము, తిరుమజ్జనపుబిందెలు, తిరువీసము, తిరుకాపులు, తిరుమాళిగెలు, తీర్థపెరుమాళ్ళు, అంగరంగవైభవములు, వేష్టువులు, సాపడి, మున్నగు వైష్ణవపారిభాషికపదము లాయాసందర్భములఁ బొందుపడినవి.

కథాసంవిధానమునఁ గావ్యము శృంగారరసప్రధానమైనదానిఁగాఁ జేయుటకు నవకాశమున్నను, మల్లన సాధ్యమైనంతవఱకు భక్తిరసప్రధానమైనదానిగ రసౌచితిని బాటించి రచియించినాఁడు. రాయలకాలమున వెలసిన పారిజాతాపహరణము, మనుచరిత్రము, రాజశేఖరచరిత్రము మొదలగు ప్రబంధములవలె రసౌచిత్యమును బాటించి పాత్రపోషణముఁ గావించి నిర్దుష్టముగఁ బ్రామాణికముగ రచియింపఁబడిన యీప్రబంధము నాంధ్రు లాదరింతురుగాత!

నిడుదవోలు వేంకటరావు, బి. ఏ.

# మనవి.

ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండారమున 1540-(b. సంఖ్యగల చదలువాడ మల్లనకవివిరచిత మగు విప్రనారాయణ చరిత్రమును మొదటఁ బరిషత్పత్రికలోఁ గొంచెము కొంచె ముగాఁ బ్రకటించుచు వచ్చి పిమ్మట ౧౯౧౫ సంవత్సరమునఁ బుస్తకరూపమున ముద్రించి ప్రకటించినారము. దీనిని సంపా దించినవిధమును నితరవిషయములును బ్రథమద్వితీయముద్రణ పీఠికలలో వివరింపఁబడినవి. ఇటీవల నవసరమునుబట్టి చేసిన మార్పులు విశేషాంశములు ద్వితీయముద్రణపీఠికలోఁ దెలియఁ గలవు.

మూలతాళపత్రప్రతినిబట్టి తొలుతఁ బ్రతి వ్రాసినప్పుడు కొన్ని పాఠములు ప్రమాదమున ననాలోచితముగ మాతృకకు విరుద్ధముగాఁ జేరినవి. శ్రద్ధగా నిప్పుడు మరలఁ జదివి, సంప్ర తించుటలో మొదటిలోపములును బ్రమాదములును జాల భాగము సవరింపఁబడినవి. కొన్ని యిప్పటికి నట్లే నిలిచియున్నవి. (అధోజ్ఞాపికలు వానిఁ దెలుపును.) కాని, మొదటిముద్రణము కంటె నీరెండవది చాల నిర్దుష్టమైన దని చెప్పఁగలము.

వేత్తలకుఁ దోఁచినసవరణలు దెల్పిన దిద్దుకొందుము.

ఈద్వితీయముద్రణపీఠికను బహువిధముల విమర్శించి వ్రాసి యిచ్చిన శ్రీనిడుదవోలు వేంకటరావు బి. ఏ. గారికిఁ బరిషత్తు మిక్కిలి కృతజ్ఞతఁ జూపుచున్నది.

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులు.

శ్రీరస్తు.

# విప్రనారాయణచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

—* ఇష్టదేవతాదిప్రార్థనము *—

ఉ. శ్రీముకురంబు లైన నునుఁజెక్కులఁ బర్వెడుమందహాసరే
ఖామధురాధరప్రభలు గన్నులహైమకరార్క కాంతులుం
దామును వియ్యమంద భువనత్రయ మేలెడురంగశాయి కాం
తామకరాంకు మాకనరనాథుని తిమ్మనృపాలుఁ బ్రోవుతన్. 1

మ. తన కాఖేటకసారమేయములు గంధర్వంబు లిచ్ఛావిహా
రనిశాంతంబులు వందిమాగధులు గాఁ బ్రామిన్కులంజేసి ని
త్యనవౌన్నత్యముఁ గన్నదేవుఁ డవనీధారేయబాహాభుజం
గునకు న్మాకయతిమ్మశౌరికి నొసంగున్ శాశ్వతైశ్వర్యముల్.

చ. గరిమ హిరణ్యగర్భుఁ డయి కావలి గా నిడికొన్నయామికో
త్కరముగతిం గెలంకులను గ్రమ్ముచుఁ దమ్మెద లుల్లసిల్లఁగా
సరవిని దమ్మిక్రొవ్విరిహజారమునం గొలువుండుభారతీ
శ్వరుఁడుచిరాయురున్నతులొసంగును మాకయతిమ్మశౌరికిన్.

మ. నిను మాయాతరుణిన్వరించు నెడనా నెయ్యంపుఁదోఁబుట్టు విం
దునవోత్తంసుఁడు గట్టఁబోలు గళమందుం ద్రాలిబొట్టించు న

త్తనపీనద్యుతిఁ బొల్చు కౌస్తుభమునుద్యద్భానువుం జూపి వి
ష్ణుని సర్వోక్తులఁదేల్చు పెద్ద[1] దయఁ బ్రోచునాస్వత్పతిక్ష్మాధిపున్.

ఉ. క్రొన్నెలబాసికంబు నెఱికొప్పున వెన్నెల గాయఁ గేలుఁద
మ్మి న్నవరత్నదర్వి నునుమించులు మించఁగ సామజంబుమో
మన్నను గన్నతల్లి తుహినాచలకన్యక యన్నపూర్ణ య
ర్థి న్నిరతంబు మాకవిభుతిమ్మనయింట వసించుఁగావుతన్. 5

శా. తాయిం బద్మభవాపదానములపాటల్ తేటలుప్పొంగఁ జం
దోయిం గచ్ఛపిఁ జేర్చి గోర్వొనలకాంతు ల్వ్రాతలై వెన్నెలల్
గాయం దంతులుమీటి తాలు గరఁగంగా గానముం జేయుభా
షాయోషామణి [2]మత్ప్రభుతీశ్వరునకుస్సంధించు వాగ్వైఖరుల్.

ఉ. తల్లికిఁ బ్రీతిగా సవతితల్లి యటంచును మంచుగట్టురా
యల్లుని శేఖరంబు గుదియున్నది యింక జలంబు లన్నియుం
జల్లఁ దలంచి శైశవమిషంబున నందఱుఁ బట్టఁబట్టన
ల్లల్లనఁ దొండ మెత్తుగిరిజాత్మజు దంతిముఖుః భజించెదన్.

గీ. భక్తకోటికి ముంగొంగుపసిఁడి యగుచు
గరిమఁ బురుషార్థసిద్ధులు గలుగఁజేయు
మామకాన్వయదేశికస్వామి యైన
శంకరస్వామిసంయమీశ్వరు భజింతు. 8

---

1. పెద్ద యనుపదము లక్ష్మీదేవి యనునర్థమున నుపయోగింపఁబడెను. పద్మాశబ్దభవము 'పద్ద' యేమో. పద్దయ్య, పద్దమ్మ వలె.

2. తత్ప్రభుతీశ్వరునకు. మూ.

క. తవిలి నుతించెద విద్వ
త్కవులఁ వాల్మీకిఁ గాళిదాసు మయూరున్
శివభద్రు బాణు మల్హణు
భవభూతిం జోరు మాఘు భారవి దండిన్. 9

ఉ. ధారఁ జెలంగి నిత్యపరితర్పితరాజరసజ్ఞమై యనా
ధారణభారతాదృతపదంబుల మించి నిరంతరక్షణా
ధారమహామహత్త్వసహితం బగునన్నయభట్టభారతీ
సారసుధారసంబు బుధసంస్తవనీయము గాకయుండునే. 10

క. ప్రాకటనవరసకలనా
సాకల్యము మెఱయుమధురసమధుద్రాక్షా
పాక ప్రబంధరచనఁ
శ్లోకం దగు తిక్కయామాత్యుజాకుం దలఁతున్. 11

గీ. సుకవిసంస్తుత్యు శంభుదాసుని నుతింప
నేర్తునే యైన నేను వర్ణింతు నతని
చిన్నిమనుమఁడఁ గావునఁ జిఱుతవాండ్ర
కొందలుపలుకులు ముద్దుసేయునారు గాదె. 12

సీ. ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవులపండువులు గాఁగ
వల్మీకభవువచోవైఖరి రామాయ
ణంబు [1]నాంధ్రప్రబంధంబుఁ జేసె

---

1. సంధ్రప్రబంధంబు—మూ.

నారసింహునిపురాణ మొనర్చి హరి మెచ్చి
నన్ను నెన్నఁడు చూచినాఁడ వనఁగఁ
బ్రౌఢిమై హరివంశ......భాగముల్
రచియించె సభలందుఁ బ్రాజ్ఞు లెన్న
దురితహరుఁ బ్రబంధపరమేశ్వరుని జెద
ల్వాడనిలయు నాదువంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ
డను నుతింప బ్రహ్మకును దరంబె! 13

ఉ. ఒచ్చెము లేనిచో వెదకు నొచ్చెము లచ్చతురాస్యు నేనియుఁ
మెచ్చఁడు విద్యలం గలుగుమేలిమియుం గడువట్టి ప్రజ్ఞచే
నిచ్చకు వచ్చినట్లు చరియించును దుష్టవి తచ్చరిత్ర మే
యచ్చున నెన్ని చూచిన నహా నగుఁబాటుగదా గణింపఁగన్.

—* అవతారిక *—

వ. అని యిష్టదేవతానమస్కరణంబును గురుచరణస్మరణంబును బురాతనమహాకవిస్తుతియునుం గుకవినిరాకృతియునుం గావించి వంశపరంపరానుబాధప్రబంధనిర్మాణహేలాధురీణుండ నగుటఁ బద్యగద్యానవద్యంబును హృద్యంబును సకల సభాసేవ్యంబు ను గా నొకకావ్యంబు రచియింపం బూని యున్నయవసరంబున విశ్వవిశ్వంభరాభారధౌరేయనిజభుజా దండుండును మేదినీమీసరగండుండును నిరాఘాటధాటీ మరుజ్జవనకంఖాణరింఖా సంఘాతసముద్ధూత క్షుళీపటలచటు లాంధకారకఖద్యోతాయమానద్యోతితాదిత్యుండును నిజయు

శశ్చంద్ర చంద్రికాధవళితాశాకటాహుండును విలాసవతీమనోహారరూపరేఖాహల్లకభల్లుండును జౌహత్తమల్లుండును సకలజనస్తూయమానాసమానదానధారాతరంగిణీమోహితవాహినీకళత్రుండును గఠోరధారాసముద్దండదోర్దండకరవాలఖండితాహితసమూహుండును ధరణీవరాహుండును ముఖరితపటుపటహభేరీభూరిభాంకారప్రతిభయపలాయితప్రతిభట (పట)లావసథాయమానగిరిగహనగుహాముఖవిముఖశరభసింహశార్దూలవరాహాచ్ఛభల్లుండును జాంబారమల్లుండును నిజచరణశరణాగతవిమతధరణిపాలబాలికాకరధృతకనత్కనక కలాచికనకాలుకాకర్పూరపేటీపిటీకరండుండును నైవరగండుండును మూరకరాజన్యగర్వాబ్ధిరాకాచంద్రుండును నగుతిరుమలరాజేంద్రుండు. 15

మహాస్రగ్ధర. కర్ణాటాధీశదత్తోత్కటవివిధమణీకంకణానర్ఘరోచి
స్స్వర్ణగ్రైవేయభూషాచకచకరుచిరాస్థాన మెల్లం జెలంగన్
నిర్నిద్రాశేషవిద్యానిపుణకవిసుధీనీతివిద్యాసమాసా
భ్యర్ణుండై భద్రపీఠిం బ్రకటితవిభవప్రౌఢిఁ గొల్వుండి వేడ్కన్.

క. వినయోన్నతుఁ గామాక్షీ
జననీనందనుని సరససాహిత్యజనీ
జనకుని నార్వేలాన్వయ
జనితుని శ్రీవత్సగోత్రు శైవాచారున్. 17

గీ. నన్నుఁ బిలిపించి యర్ధాసనమున నునిచి
యాదరోక్తుల నిట్లని యానతిచ్చెఁ

బెక్కుఁ దెఱఁగులఁ గృతులు చెప్పించుకొంటి
నైన నా కొక్క పద్యకావ్యంబు వలయు. 18

ఉ. శాతకృపాణనిర్దళితశత్రుఁడు సాళువనారసింహధా
త్రీతలభర్తయు న్గజపతిప్రముఖుల్ చతురంతయానభూ
షాతపనీయవస్తువు లొసంగఁ దనర్చిరి నీయనుంగుము
త్తాతయుఁదాతయున్బవివిధాతలుమల్లనయెఱ్ఱనాహ్వయుల్

శా. రాజు ల్మెచ్చఁగఁ జెప్పి కావ్యములు హేరాళంబుగా సద్రిక
న్యాజాని న్భజియించు నిత్యనియతిం దత్తాలపూజాక్రియా
భ్రాజిష్ణుత్వమున జపించు దినముం బంచాక్షరీమంత్రముం
దేజోవంతుఁడులింగనార్యుఁడుగుణోత్కృష్టుండుమాతండ్రియున్

క. అనుపమరచనం ద్విపదగ
మును రుక్మాంగదచరిత్రమును మహిమ నొన
ర్చినకృతి వెఱ్ఱాప్రెగ్గడ
మనుమఁడ వనఘుఁడవు నీవు మల్లనసుకవీ. 21

వ. కావున విష్ణుభక్తిపరాయణుం డగు విప్రనారాయణుచరిత్రం బొనరించి మదీయమనోరథంబు సఫలంబు సేయు మని కర్పూరతాంబూలజాంబూనదాంబరాభరణంబు లొసంగినం బరిగ్రహించి కృతిముఖాలంకారంబుగాఁ దదీయవంశావతారం బభివర్ణించెద. 22

—* కృతిపతివంశావతారము *—

ఉ. అంచలతేరుఁ బల్లుజవరాలును బొక్కిటితమ్మిరచ్చ క్రొ
మ్మించులనీనుమేను నునుమిన్నుపొగడ్తయుఁ (జివ్వ)బోస వహా

సించినకాన్పు ముజ్జగముఁ జేసిననేర్పును జన్నిదంబుఁ దీ
వంచ మొగంబులుం గలుగు వాఁడు చెలంగుచు వేల్పుఁబెద్దయై.

క. అతఁ డత్త్రిఁ గనియె నతనికి
సుతుఁ డయ్యెను జంద్రుఁ డతనిసుతుఁ డయ్యె బుధుం
డతనికిఁ బుట్టెఁ బురూరవుఁ
డతఁ డాయువుఁ గాంచె నహుషుఁ డతనికిఁ గల్గెన్. 24

ఉ. ఆకమనీయమూర్తికి యయాతి జనించెను దత్కులంబునం
బాకమురాచిరా జనునృపాలుఁడు పుట్టె బలంబు శత్రులుం
బోకము గాఁగ లోకము ననారతనైజభుజాపదానజ
ల్పాకము గాఁగ మించెను దపఃపరిపాకమహత్త్వసంపదన్.

క. ఆజనపాలుఁడు గాంచెను
రాజకళాభోజుఁ దిప్పరాజు నతం డు
ద్వాజితశరణ్యచరణాం
భోజుం గనె భానుతేజు ముమ్మడిరాజున్. 26

ఉ. ఆపృథివీశరత్నమున కాత్మజులుం బెదమాకరాజు శౌ
ర్యాపరబాహులేయుఁడు గుణాభరణుం డెఱమాకరాజు ల
క్ష్మీపతిరాజు దానగుణశీలుఁడు ముమ్మడిరాజు నెల్లధా
త్రీపురుహూతుఁ డర్థిసురధేనువు తిమ్మనృపాలచంద్రుఁడున్.

క. అందు నెఱమాకమహీశం
క్రందనుఁడు కుమారమాకఘనుఁ గాంచె నతం
డిందుముఖీకందర్పు న
రిందము శ్రీరంగనృపవరేణ్యునిఁ గాంచెన్. 28

ఉ. వారలలోన దానగుణవంతుఁడు ముమ్మడిరాజచంద్రుఁ డం
భోరుహబంధుతేజుఁ డతిపుణ్యుఁడు వైరిమదాపహారి దే
వేరులుగా వరించె జనవిశ్రుతరాచమదేవి నంచితో
దారగుణాన్వితం దిరుమలాంబను సౌఖ్యరసైకలోలుఁడై. 29

సీ. ఆపురంధ్రులయందు నగ్రపత్నికి ధైర్య
మంధానగిరి యెఱ్ఱమాకరాజు
వెంగళక్షితిపాలపుంగవుఁడును బట్టు
[1]మాకరాకన్న రఘుపతిరాజు
ఘనుఁడు లక్ష్మీపతిక్ష్మాపతి తిప్పరా
జేంద్రుఁడుఁ గలిగిరి యితరసాధ్వి
వలనఁ దిమ్మఘనుండు నలరామచంద్రుండు
వరదరాజెఱ్ఱమాకధరణిధవుఁడు
జననమును బొంది శాశ్వతైశ్వర్యమహిమఁ
జక్రవర్తులభాతిని షడ్గుణముల
సరణిఁ బురుషార్థములరేవఁ జతురుపాయ
ములవిధంబునఁ బ్రఖ్యాతి వెలసి రందు. 30

క. మానధనుల్ దానస్వ
ర్ధేనుసమానులును నైనతిరుమలదేవీ
సూనులలోఁ దిమ్మమహీ
జాని ఘనుం డయ్యె రామచంద్రునిరేవన్. 31

1. యతిభ్రంశమైనది. నిజమైనపేరు తెలియక దిద్దలేదు.

తరలము. అతఁడు సంగరరంగమందుఁ గరాసిభిన్నవపుఃపర
శ్శతవిరోధిగళక్షరక్షతజంపుశేటులు విక్రమో
న్నతగతిం గలిగించి పేర్చె ననారతంబు మహీతలం
బతులభంగి ననేకశోణనదావృతం బన మించఁగాన్. 32

గీ. ఆనృపాలుఁడు తనకు నర్ధాంగలక్ష్మి
యైనబొమ్మలదేవియం దాత్మజులను
గనియె లక్ష్మీపతీంద్రు మాకక్షితీశు
బాపవిభునిం ద్రిమూర్తులపగిదివారి. 33

వ. అం దగ్రజుండు. 34

క. పరమపతిభక్తిగుణాసం
భరిత సుజనవినుత మల్లమాంబాదేవిం
బరిణయమై చినతిరుమల
నరపతిఁ గనె విష్ణుకీర్తనప్రవణాత్మున్. 35

శా. ఆలక్ష్మీపతిసోదరుండు నయవిద్యాశాలి మాకావనీ
పాలుం డాదిమదానవర్తనముచం బ్రఖ్యాతుఁడై వైభవ
శ్రీల న్మించెను బంధుజాలములఁ బ్రోచె న్నీతిచే భూతలం
బేలెన్ వైరులఁ దోలె వింధ్యగిరిమధ్యేకాననశ్రేణికిన్. 36

మ. నృపచూడామణి యావదాన్యగుణకానీనుండు జన్యక్రియా
నిపుణుల్ డెబ్బదియేడుపాళెములమన్నీ లేకమై బైచగుం
డ్లపయి న్వచ్చినఁ గోట వెల్వడియె లీలం గోటమాకక్షమా
ధిపుఁడంచున్నుతియింప వారి భుజశక్తి న్నెల్చె సామాన్యుఁడే!

మ. అలఘుప్రాభవుఁ డానృపాలుఁ డనసూయారుంధతీతుల్యఁ ది
ప్పలదేవి న్వరియించి కాంచె సుతులం బ్రత్యర్థిధాత్రీధరేం
ద్రులఁ దిమ్మక్షితిజాని బొమ్మనరనాథుల్ భీమబాహాబలో
జ్జ్వలు లక్ష్మీపతిరాజుఁ బ్రాక్తనతపస్సంపత్ప్రభావంబునన్.

క. ఆభూపాలకులందుం, బ్రాభవశౌర్యప్రతాపభాగ్యోన్నతులన్
శోభిల్లెఁ దిరుమలేంద్రుఁడు, నాభాగదిలీపరంతినహుషుల తేవన్.

సీ. విమతగర్వావనధ్యవింధ్యాద్రి కెవ్వాని
భీమకరాసి కుంభీభవుండు
త(రుణీజనమ్ముల)తలఁపు నెత్తమ్ముల
కెవ్వానిసౌందర్య [1]మి(నకరంబు)
సర్వసర్వంసహాశాకిక కెవ్వాని
బాహుపీఠిక వజ్రపంజరంబు
మినుకుబల్ జెట్టిసాదనకును నెవ్వాని
లాలిత(రసన విలాస)ఖురళి
యతఁడు వొగడొందు జన్యక్రియానుకూల
సకలసన్నాహవదనన్యసాధ్యదుర్గ
గిరివిభేదనమార్గజాంఘికబలుండు
ధీరగుణహారి మాకయతిమ్మశౌరి. 40

మ. హరిబాహాబలశాలి మాకవిభుతిమ్మాధీశుఁ డుద్యద్గుణా
కలితుం డభ్యుదయంబుఁ బొందుట మొదల్గా నర్థివిద్వత్తపిం

1. మిందిరంబు, మూ.

సరసమాధుర్యవాక్సరణికి వన్నెగా
నతులితసత్యసంధత చెలంగ
దర్పితాహితధారుణీధవము హాపా
ధాసమర్పితవస్తుసాదరకటాక్ష
వీక్షణుం డైన మాకభూవిభుకుమార
వరుఁడు లక్ష్మీపతిక్షితీశ్వరుఁడు వెలయు. 45

గీ. పెక్కుమాఱులు పార్వతీప్రియరమాధి
పులకుఁ జేయించె నవలక్షపూజనములు
వరుసఁ జెప్పించికొనియె సంవరణచరిత
మెలమి మాకయలక్ష్మీపతీశ్వరుండు. 46

క. (చండ)క్ష్మాపతి ధరణీ
మండితనిజభుజుఁడు గండమండలవిచల
త్కుండలుఁ డహితారుంతుద
కాండుఁడు మాకవిభుతిమ్మఘనుఁడు చెలంగున్. 47

చ. కదనమునందుఁ దిమ్మవిభుఖడ్గముచే హతులైనవారిఁ దా
మెదురుకొనంగ నేసలు పయింబడఁ జల్లఁగ సంభ్రమంబునం
బొదువసుధారసంబుఁదమిబువ్వము వెట్టుచునుండఁగాఁ జుమీ
నిదుర యొకప్పుడుం గలుగనేరదు వేలుపుఁబేరఁటాండ్రకున్.

మ. మహిళాసూనశరుండు మాకవిభుతిమ్మక్షోణిపాలుండు పూ
ని హరిప్రీతిగ నర్థితోడ నొసఁగున్ హేమాద్రికల్పోక్తహే
మహయగ్రామమదేభధైనుకధరామాణిక్యముఖ్యంబుగా
సహిరణ్యోదకదానపూర్వముగ నిచ్చల్ భూసురశ్రేణికిన్.

చ. అరుదుగ మారుతాశనగళాకృతికిన్ భయమంది ధారుణీ
ధరకటకస్థలీకఠినత న్వెలుఁగుంది దిశామదేభరా
ట్కరపుటభేదనక్రియలు గావని రోసి ధరిత్రి నిల్చె సు
స్థిరముగ మాకభూవిభునితిమ్మనబాహుపురిం బ్రియంబునన్.
చ. ఇల నెలదోఁటలందుఁ జరియింపఁగ సాధము లెక్కఁ జిత్రసం
కులమృగరాజిఁజూడసమకొల్పుదురౌఁదమకూర్చునెయ్యపుం
జెలులకు సాళ్వమాకనృపశేఖరుతిమ్మనృపాలచంద్రుతోఁ
గలనను మార్కొనంగడఁగు గబ్బివిరోధు లదేమిచిత్రమో!

—* షష్ఠ్యంతములు *—

క. ఈదృగ్గుణగణపేటికిఁ
గోదండకళావహాసితకుంజరరక్షో
భేది కరిధిక్కరణాయువ
సాదవిధేయునకు విక్రమాజేయునకున్. 52

క. అతులితనుతవితరణయుత
చతురకరోదగ్రునకును సముదాహూత
ప్రతిపక్షక్షితిపక్షు
త్యతివక్షఃక్షతజలక్షితాస(హను)నకున్. 53

క. దోర్గర్వదళితరిపుకట
కార్గళవర్గునకు శాశ్వతైశ్వర్యకళా
భర్గునకు సాధితాహిత
దుర్గాధ్యక్షునకు శ్రీవధూవక్షునకున్. 54

క. వేదండ...నవకర్ణున[1]
కాదినృపాలప్రతాపహానదఖిలదిశా
మేదురషడ్గుణరేఖా
ప్రామర్ఛవదతులకీర్తిపరిపూర్ణునకున్. 55

క. ఇల రాజదిలీపునకును
సలలితరూపునకు సత్యసల్లాపునకున్
బలవద్వైరోధిపార్థివ
కులసంతాపునకు సోమకులదీపునకున్. 56

క. నరనుతకటారిసాళువ
వరబిరుదాంకునకుఁ గాంతివంచితరాకా
హరిణాంకునకును మాకయ
తిరుమలనరపతికి సారధీగీష్పతికిన్. 57

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నారచియింపంబూనిన విప్ర
నారాయణచరిత్రం బనుమహాప్రబంధంబునకుం గథాక్రమం
బెట్టి దనిన. 58

సీ. ప్రాచీనకంటకప్రకటకుట్టనగళ
త్పుండ్రేక్షురసఝరాపూరితంబు
సకలజాంతవపిపాసాహారినారికే
ళాంబుసంభృతతటాకావృతంబు
గారుత్మతాశ్మశంకామిళత్ఖేచర
పాటలక్రముకశలాటుకంబు

1. వేదండధ్రాన్నవకేనుఽన—మూ.

తనుమరుచ్చ్యుతమహీతలబహుధాభిదే
ళిమపాండునాగవల్లీదళంబు
రంగదురుగోష్ఠరింఖత్తడంగరీయ
జిగమిషాత్వరఖురహతజీర్ణచూర్ణి
తోషమారీచరేణుసంయుక్తదశది
శాప్రదేశంబు చోళదేశంబు వెలయు. 59

క. తిరునాళ్ళను దేర్ధులు నన
వరతంబును నంగరంగవైభవములునుం
దిరమగును దేవళంబులఁ
బరఁగఁగ నొకకోడి గూయుపల్లియ నైనన్. 60

క. అందముగ భరతఖండం
బందును గాశ్మీరఖండ మనఁ దద్దేశం
బెందును మహిమను రాజ్యము
లందు న్మఱి రామరాజ్య మనఁగా వెలయున్. 61

క. ధారుణి మండంగుడి యను
పేరం దద్రాజ్యమందుఁ బెంపు దలిర్పన్
వైరించిపురప్రత్యా
హారంబై యొక్కయగ్రహారము వెలయున్. 62

సీ. హుతహావిశ్చర్వణోద్యుక్తులై గీర్వాణ
పుంగవుల్ గ్రుక్కిళ్ళు మ్రింగుచుండ
హవ్యముల్ భుజియింప నలవి......లగ్ని
సప్తజిహ్వాలకు ముచ్చటలు మునుఁగ

మఱిపుసఁ దాఁ బితామహుఁడు ప్రాఁజదువులు
చదువ సంధ్యలఁ జొచ్చి యొదిఁగి వినఁగ
సతతాహ్నికక్రియాసంశయంబులు దీఱ
నందంద బ్రహ్మర్షు లధివసింపఁ
బరఁగుఁ బరిపక్వఫలభారభరితవిటపి
లసితసురభిళకిసలయప్రసవభసల
విసరలసదుపవనతీర విబుధ......
...నియవ్విప్ర... 63

క. సాదు లనం దగు నానా
వేదులు నాగమపురాణవేదాంతకళా
వాదులుఁ జెలఁగుదు రప్పురి
వేదులపై సోమసూర్యవీథులయందున్. 64

క. స్వస్తి యన నొల్ల రప్పురి
వాస్తవ్యద్విజులు వస్తువాంఛల ధనదుల్
స్వస్తి యనుమాట విన్నను
నాస్తియు నన నొల్ల రందునం గలవిప్రుల్. 65

శా. ఖ్యాతి న్మించి సదక్షిణాకముగ నాహారంబు ధాత్రీసుర
వ్రాతం బందుఁ బసిఁడిపళ్లెముల ధారాదత్తము ల్చేయ న
య్యో తారాధిపమౌళి యేమిటికి రాకున్నాఁడు వే రాఁగ న
య్యాతిథ్యాం బొనరింప నీక్షణమె భిక్షాన్నంబు వారింపఁడే.

ఉ. ఆనగరంబునం బ్రతిగృహంబున నధ్వరకర్త లైన తే
జోనిధు లెందఱో యెఱుఁగఁ జోద్యము లెప్పుడుఁ జూడ మించు స్వా

హోనినదంబులు న్నతియజాంచితఘోషము యాయజూకహో
స్వానములుం జెలంగు జితసాంజనితాన్యతరస్వనంబులై. 67

సీ. చందురులో నున్నకందుఁ దామణఁగించు
శేవఁ [1]జెందలలకొండియలు చెలఁగ
జిగిమీఱు మడుఁగుఁగుచ్చెళ్లు దుత్తూరపు
ష్పముల కైవడిఁ గటిస్థలుల మెఱయ
మేచాయకోడి క్రొమ్మెఱుఁగులు చరణాన
తములైన గతిహంసకములు మొరయ
మొలకచన్నులతోడిముచ్చట కత్రాడు
చెలువునఁ దడఁబాటుచెవులు వ్రేలఁ
గలిత మంజులమంజరీగా(థ)వికచ
చకచకద్యుతి గండపాళికల నెసఁగఁ
బావనక్షోణిసురబాలికావరేణ్య
లమరుచుండుదు రయ్యగ్రహారభూమి. 68

మ. నటదలోర్ధ్వశిఖాభిరాములు సువర్ణగ్రంథిభూషాపరి
స్ఫుటకర్ణద్వయరంధ్రదర్శితనిజాంసుల్ దర్భముద్రాంగుళీ
ఘటితాలంకరణుల్ జలస్నపనరాగద్యోతధౌతాంబరుల్
నిటలాలంకృతగోపిచందనులు వర్ణింపం బురీభూసురుల్. 69

మ. గోనబై దండములందుఁ గ్రొంబసుపునిగ్గుల్ దేఱుకౌపీనబం
ధనము ల్లుంజులు వ్రేల్మిబొట్లుఁ గడు నందం బొందఁ గృష్ణాజినం

1. చెన్నుశబ్ద మిందు వృత్తియందుఁగూడ సుందరార్థమునఁ బ్రయోగింపఁబడినది. ఉ. చెంగావి— ఇట్టివి కన్నడమున నధికముగాఁ గలవు.

బునఁ గీలించినజన్నిదంబులు మనోమోదంబు సంధింపఁగా
ఘనతం బొప్పు సమిత్కుశాహరణరింఖద్బ్రహ్మచార్యోఘముల్.

—* విప్రనారాయణునిజన్మము *—

క. హరివనమాలికయంశము
ధరలోపల నవతరింపఁ దలఁచిన దై యు
ప్వరి నొక్కవిప్రకాంతయు
దరముఁ బ్రవేశింప సతికిఁ దగ నెల మసలెన్. 71

సీ. ఇతరమానవకాంత లెన గారు తన కని
యుమియుక్తైవడినిఁ జిట్టుములు బలిసె
హరి త్రివిక్రమమూర్తి యయ్యె నీక్రియ నన్న
గతిఁ గ్రమక్రమమునఁ గాను వొదలె
నర్భకుకీర్తి పై కావిర్భవించెనో
యన మోము పాండిమ నతిశయిల్లె
విశ్వంభరుని మనోవీథి నిల్పినపుత్త్రుఁ
దాల్చుట నన సోలుఁదనము మించెఁ
బ్రకటదౌహృదకుంభసంభవవిభూతి
యౌవనారంభఘనవిలాసార్ణవంబు
నింకఁజేసినచోఁ దిరోహితము లైన
తత్తరంగంబు లన నింతితఱులు విరిసె. 72

ఉ. అంతట జిష్ణుతారను ధరామరతామరసాక్షి వేదవే
దాంతరహస్యవేది సుగుణైకశరణ్యు నగణ్యశేముషీ

మంతుని భూరితేజు సుకుమారుఁ గుమారునిఁ గాంచె దేవకీ
కాంత సరోరుహాక్షుని జగన్నుతు వెన్నునిఁ గన్నుఁ గైవడిన్.

క. గుమగుమ యను నెత్తావుల
కొమరమరె న్విరులసోన గురిసె న్సోరసెఁ
ధిమిధిమిని దివ్యదుందుభు
లమరమనోహర్ష హేతు వగున వ్వేళన్. 74

చ. అలఘుమణిప్రదీపనికరాకర మై తగుసూతికాగృహ
స్థలమున నూత్నరత్నఖచితం బగునుయ్యెలతొట్లలోనఁ బా
ల్తల వసియించి మించెను సుతుండు సవిద్రుమ మైనవార్ధిఁ జి
ల్వలదొరకుప్పసంపుఁబొరలం బవళించుమురారి యోయనన్.

మ. జననీదుర్భరగర్భగోళముననే సర్వజ్ఞుఁడై ప్రజ్ఞచే
ఘనతం బొల్చెను దత్పరాశరునిరేఖన్ భూరివైరాగ్యబో
ధనిరూఢిన్ శుకయోగిచందమున నందం బందెఁ దానెన్నఁడే
జననం బొందె సతం డదే మొదలుగా సర్వంసహామండలిన్.

క. కూడిమిసుతునకు మాఱట
నారాయణునకును విప్రనారాయణుఁ డ
న్పేరిడి జననీజనకులు
గారవమునఁ బెనుప నతఁడు ఘనవర్ధితుఁడై. 77

క. అపు డఖిలవేదవిద్యా
నిపుణుం డగుతండ్రిచేత నిర్మలతేజో
నుపమానమూర్తి యాసుతుఁ
డుపనీతుం డయ్యె శుభముహూర్తమునందున్. 78

గీ. శౌనకుని భీష్ము శుకు విభీషణునిఁ బుండ
రీకు రుక్మాంగదుని సంబరీషు దాల్భ్య
నరుని నారదునిం బరాశరు వసిష్ఠు
వ్యాసుఁ బ్రహ్లాదు మించె నవ్వైష్ణవుండు. 79

ఉ. ఆసమయంబునందు సొబ గయ్యెను నంగభవాంగ రేఖ, మి
థ్యాసఖ మయ్యెఁ గౌను, వదనైందవబింబరుచుల్ నితంబినీ
భాసురదృక్చకోరములపండువు లయ్యెను, జెన్నుమీఱె భూ
మీసురసూతికి న్నోలకమీసము, ప్రాయము డాయవచ్చినన్.

—* విప్రనారాయణుని వైరాగ్యము *—

ఉ. అవ్వసుధాసుధాశనకులాభరణుం బభిరమ్య మైనయా
జవ్వన మాజవంజవవిశాలసుఖానుభవైక యోగ్యమై
నివ్వటిలన్ విరక్తిసరణిం దగె నిందుముఖుల్ రతీచ్ఛచే
నువ్విళులూరుడెందముల నోలిఁ జివుక్కు రటంచు నుండఁగన్.

క. వానికి ఘటికాచషక
స్థానోదక మనఁగఁ బొదలసాగెను దినముల్
దా నసమానసవీన
జ్ఞానానూనప్రధానుసంధానంబున్. 82

క. అంతంతకు వైరాగ్యం
బింతిం తనరాక యొలమి నిగు రొత్త నతం
డెంతయు నొకనాఁ డిట్లని
చింతింపఁ దొడంగె నేకచిత్తుం డగుచున్. 83

సీ. అనఘక్షమాగుణంబునకుఁ బెట్టనికోట
యీషణత్రయమున కెమరుఁజుక్క
చింతామహాంబురాశికిని జల్లెలికట్ట
రాగంబునకుఁ జేరరానిచోటు
బలవదంతర్విరోధులకును వేర్విత్తు
శ్రేయోవధూటికి జీవగఱ్ఱ
చిత్తనైర్మల్యసంస్థితికిని విడిపట్టు
ప్రహ్లాదమునకును బట్టుఁగొమ్మ
చారుగుణరత్నములకు విహారభూమి
శమదమాదికములకును సంశ్రయంబు
ధైర్యరసమున కెడదవ్వు హైన్యమునకు
నప్రదేశంబు వైరాగ్య మరసి చూడ. 84

వ. అని వితర్కించి వెండియు నఖండజ్ఞానలీలావిహారుం డగు నవ్విప్రనారాయణుండు నితంబవతీగేయం బగు నెలప్రాయంబు క్షణభంగురం బనియును గుటిలకుంతలప్రభాజితమదవదిందిందిరమందిరేందీవరమందిర యగునిందిర కెందమ్మికెందలిరుటాకునం జెందినసలిలబిందువుచందం బనియును సుకుమారంబు లగుశరీరంబులు చలదళస్పందంబు లనియును గృతార్థీకృతభోగిభవంబు లగుస్రక్చందనవనితాద్యనుభవంబులు నశ్వరంబు లనియును ననేకజన్మపరంపరాసంపాదితపుణ్యపరిపాకవ్యయప్రభవంబు లగుసితచ్ఛత్రచామరాందోళికాదివిభవంబులు నీరుబుగ్గలుంబోలెఁ దగ్గు ననియును నా

జవంజవప్రమదాపాదు లగుసుతకళత్రాదులు మాయామా పంబు లనియును మాసర్తుసంవత్సరమయం బగుసమయం బమేయం బనియును శైశవాదికదశాప్రవణం (బగు నా) యుఃప్రమాణంబు......కుపమేయం బనియును నభిజాతం బగుజాతంబు శంపాకంపమానం బనియును సకలజనస్తుత్యం బగుమిత్రసాంగత్యంబు...మతంగజకర్ణచపలం బని యు నిజ నిర్మాణ విచక్షణవిరించం బగుఘటపటాదికవస్తువిస్తారితవిశ్వ దృశ్యప్రపంచంబు స్వప్నంబు తెఱం గనియును బ్రశస్తం బగు సమస్తంబు నింద్రజాలోపమానం బనియును నిశ్చయించి భవ లతాలవిత్రంబును నవిద్యాజైత్రంబును బవిత్రజ్ఞానకందం బునుం బరమానందసుధానిష్యందంబునుం బురందరబ్రహ్మాది కృతసపర్యంబును నగువిష్ణుకైంకర్యంబు...లైన కార్యం బని యవలంబించి తదనుసంధానపరాయణుండై వర్తించుచుండె.

శా. కద్రూజప్రతిపక్షజిజ్జవనభర్గప్రేయసీగేహ లే
ఖద్రూరీకృతదానఖేలన సమిద్గాంగేయ సౌభాగ్యజా
గ్రద్రూపప్రియతానుభావదబలాకందర్ప సామ్రాజ్యసం
పద్రూఢానుపమప్రభావ కవిరాడ్బంధుప్రియంభావుకా! 86

క. అంబుధిగభీర మత్త
స్తంబేరమకటమదాంబుధారాలహరీ
జంబాలవద్గృహాంగణ
యంబాళాచార్యపదసమాశ్రయహృదయా! 87

స్రగ్విణి. సర్వసర్వంసహైశ్వర్యదానీకినీ
దుర్వితాత్మద్విషద్భూభవశంకాసమీ
చర్వితద్విట్పదాంచద్గరుత్మన్మణీ
ధూర్వహాలంక్రియా దూరితాహంక్రియా! 88

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యా
నానంద సౌందర్యధుర్య ప్రబోధపరమేశ్వరవంశపవిత్ర లిం
గనమనీషిపుత్ర శ్రీకాళహస్తీశ్వరదయాసహాయ చదలువా
డమల్లననామధేయప్రణీతంబైన విప్రనారాయణచరిత్రంబను
మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# విప్రనారాయణచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీరంగేశ్వరపదప
ద్మారాధననిరత తిప్పమాంబాగర్భ
క్షీరాంభోనిధిచంద్ర సు
ధీరక్షణ మాకరాజతిమ్మనృపాలా. 1

గీ. అవధరింపుము విప్రనారాయణుండు
విష్ణుకైంకర్య మిట్లు గావింపఁ బూని
నైజగమనోచితప్రయత్నమునఁ గదలి
కతిపయగ్రామములు లీలఁ గడచి యెదుట. 2

—* శ్రీరంగపురవర్ణనము *—

ఉ. అంగభవాహితప్రియపదాంబుజభృంగ మతండు గాంచె శ్రీ
రంగము గారుడాశ్మగృహరాజివిభాయవసాగ తేందుసా
రంగము రక్షకీకృతవిరాజతురంగము ముక్తినర్తకీ
రంగము నంతికోపవనరమ్యకవేరసుతాతరంగమున్. 3

శా. నాళీకాక్షులు చూతు రప్పురమున న్జాబిల్లిలోకందు కుం
దేలో వార్నిధిపంకమో హరిణమో నిక్కం బెఱుంగంగఁ ద

స్త్రైలీసౌధము లెక్కి నెక్కొనిన సందేహంబు వో బింబముం
గేలుందమ్ములఁ బట్టిపట్టి యచురక్తిం గ్రమ్మఱం గ్రమ్మఱన్. 4

మ. పురి నింద్రోపలగోపురోపరిసముద్భూతప్రభల్ భూనభోం
తరము ల్నిండ నకాలసంజనితకృ(ష్ణ)వ్యంజనచ్ఛాయ లా
హరిదశ్వాశ్వకషత్తలీనవివృతాస్యవ్యక్తదంతంబులం
దరుదారందరియందసూరుఁడు తదీయాయుఃపరిజ్ఞానియా[1].

శా. భూరిప్రాక్తనవర్తమాననృపు లంభోజేక్షణప్రీతిగా
సారద్రావిడవేదవేత్తలబుభుక్షుల్ దీర నానావిధా
హారోదారములై తిరంబులుగఁ జేయం బొల్చు నచ్చోట నె
చ్చో రామానుజకూటము ల్సకలవస్తుశ్రీనిరాఘాటముల్. 6

చ. అతులితభంగి నున్నతి నహంకృతినిం దమతోడ నీడు గా
వితరమతంగజంబులు మహీస్థలిలో ననుమాట నందు న
ప్రతిమమదాంబులోలదుదరంభరిబంభరగంధసింధుర
ప్రతతి నిజంబు సేయును గరంబుల విష్ణుపదంబు ముట్టుచున్.

మ. లలితోత్సాహములై సువర్ణమణిమా[2]లాకంధరాస్ఫూర్తి రం
జిలఁ గందంబులు గల్గి మంగళమహాశ్రీలం బ్రకాశించి కాం
తిలసత్కేసరబంధురంబు లయి పృథ్వీవర్ణితఖ్యాతి ని
చ్చలుఁగావ్యంబులనం జెలంగుఁబురినాజానేయగంధర్వముల్.

సీ. పుణ్యజనాధారపురభేది యగుభూత
పతికి నశ్వంబులఁ బట్టెఁగాక

1. పరిజ్ఞానముక్-మాతృక. 2. లోరక్షసల-అని మాతృక.

ధీవరులకు డాఁగి తిరుగుజంతువుచేత
నరయ విద్యావంతుఁ డయ్యెఁగాక
పద్మినీరతుఁడు రేపటివేళఁ దాన నై
యసురులతోడఁ బోరాడెఁగాక
తనయిూడు విబుధసంతతిదండ వసియింప
మహి నిమ్ము లేకుండ మనియెఁగాక
కాకయుండిన విధికృతక్రతువిశేష
హుతసమాహూత పురుహూత హితసమస్త
దివిజతత్పరిధారుణీదివిజవరుల
సాటిగా కున్నె పంకజసంభవుండు. 9

ఉ. హైమకరార్కవంశభవు లప్పురి రాకొమరు ల్పరాక్రమో
ద్దాములు వారు బాహుబలదర్పమునం బగఁ బూని రేని సు
(త్రాముని నైన హే)ల సమరంబున గెల్తురు దానవైఖరిఁ
హేమనగేంద్ర మొక్కనికి యిత్తురు కైవస మై చెలంగిసన్.

క. పటుబుద్ధిని నేర్చెను ద
త్తటకస్థకిరాటవరులకట్టడ ధనదుం
డెటువలె నయ్యెను యక్షుం
డఁట తాను మనుష్యధర్ముఁ డటు గాకున్నన్. 11

ఆ. వైరివిజయ మగ్రవర్ణత్రయిూసేవఁ
బ్రకటితాచ్యుతైకభక్తినిరతి
సత్త్వగుణులుఁబోలె సన్న్యాసులునుబోలెఁ
బురముశూద్రవరులు పొలుతు రెపుడు. 12

చ. లలితపదాబ్జసంపదఁ గలాపవిభూతి సుదర్శనప్రభా
విలసనముం బయోధరనవీనరుచుల్ జితనాగయానముం
దలిమ భుజంగభోగకలనంబు సువర్ణపటాభిలాషముం
గలిగి తనర్తు రప్పురముకాంతలు విష్ణునిమూర్తులో యనన్.

వ. మఱియు నప్పురంబునం గవేరకన్యాలలామం బభిరామం బగుచు వివిధసమీప మహీరుహాచ్ఛాదిత శ్యామాయమాన కూలంకషలహరీముహుర్ముహుర్విహారమాణ స్వాయంభువ సైంధవగరుత్ప్లవమాన పరంపరాసముద్ధూతంబు లై ఘుమఘుమాయమానంబు లగు నెత్తావులఁ గ్రేవలం గప్పుపుష్పోల్లి దుమారంబులఁ దోరంబు లగు కెందమ్మిఱేకులఁ దొరంగుమధురమధురసంబులు గ్రోలి సోలి వ్రాలి మత్తంబు లగు నెలదేఁటి మొత్తంబులపైఁ బడి పతితంబులగుచు సింధురాజదత్తంబులై నిజధమ్మిల్లబంధంబునఁ గనుపట్టు తలఁబ్రాలచందంబున నందంబు లగుశీకరబృందంబులును, నతిత్వరితనిరంతరజగజ్జిగమిషావధానుం డగుపవమానుం డంచెలంచెలం బెట్టినఁ గట్టాయితంబులై కనుపట్టు హయఘట్టంబులచందంబున నందందఁ దుటుములై పరిత్యక్తయవసగ్రసనమంథరారోమంథ పరిపతత్పాండుడిండీరభంగంబు లగుకురంగంబులునుఁ గర్ణరసాయనాయమానంబు లగుసామగానంబులునుం బరిపరివిధఖండితేతరమతభేదంబులగుశాస్త్రవాదంబులును గుశసమిత్పలాశప్రదేశంబులును హరిణవాంఛాచరితప్రత్యూటజపరస్వాగవేషణంబులగు పటువటుకఘోషణంబులను బొలిచి బహువిధసంభా

రభరితాదరకౌశలంబు లగు యాగశాలాప్రదేశంబులు ను, హుతహుతాశనముఖంబుల మిగులం బుగులుకొను హావిఃప రిమళంబులతోడం బరిమిళితంబులై పొడమి పుడమి నెల్లెడల నిండి మెండుకొని జగదండఖండంబునం గార్కొని తార్కొన్న తమకంబుల బుత్విగాహ్వానంబులకుం జనుదెంచు నిర్జరుల వెంట నంటి తానును నాతిథ్యంబునకు వచ్చియున్న యన్నింగి తెఱంగునం గనుపట్టు హోమధూమంబులకు జన్మస్థానంబు లగురోదోవనివితానంబులును, నక్రగ్రాహఝషఘులీకుళీరం బులు పరస్పరవైరంబులం బోరాడు సమ్మర్దంబున కోర్వక బహిర్గతంబు లగుజలమానుషీకదంబంబులపయిం గనుపట్టు మేల్మంసుంగుల తెఱంగున రంగుమిగిలి ఖరకరుం డురుకిరణనిక రంబులు వఱపి తెఱపిం గని పయఃపూరంబు లపనయింపం జలపట్టి పట్టినజలంబులు మరలం గ్రక్కించెద మని దండయా త్రాకుతూహలమానసంబులన్ జలదేవతాసంచయంబులు వెలి విడియించిన పటభవనంబుల చందంబున రంగత్తరంగ ఘట్టనం బుచ్చి తెట్టువలు గట్టి దరులం దొట్టి చూపట్టు క్రొ న్నురువుతండంబులును, నహరహఃపయోరుహావిహారణ పరా యణాద్రవిళధవళేక్షణావక్షోజమంజరీమంజుమంజులసంకలితకుం కుమపంకంబులు బుగులుకొన నిగనిగలు మిగుల గగనతరంగి ణితోడి సాపత్న్యదోషంబునంబోలె నెట్టవాటి ఘూర్ణిల్లుచు మిన్నుముట్టి మరుల్లోలంబు లగునుల్లోలంబులును, మృదం గంబులం బెల్లెగయు ధింధిమిధ్వానంబులకుం జంచరీకగానం

బులకును బహువిధావధానంబులఁ గమలహస్తాభినయంబుల తోడ నాడుపద్మినీనికరంబులం గని కరంబలరి దిగ్వధూజాలంబులు పొసంగ నొసంగు నొసంగులు నైన దుకూలచేలంబులమాడ్కిఁ జూడ్కిపండువు లై పరిత*ప్రవర్తనంబుల నుత్పతన హేతువు లగురాజమరాళంబులును, సింధునాథావరోధంబునఁ బొల్చుక్రీడాశైలంబుల విభ్రమంబుల నభ్రంకషంబు లై వెలయు పులినతలంబుల నెసక మెసఁగ మసకంబులఁ జెలంగుచుఁ దరళతరంగపరంపరం బొంపిరివోవుతుంపురులఁ బొలయు మలయమరుదంకురంబులు మెసవుచు సమగ్రంబు లగునుదగ్రమణిగణచ్ఛాయామండలంబు లీరెండలకు మార్గలయ నుత్ఫణంబులై యాడుచు భృంగీసంగీతంబులకుఁ జొక్కుచు జలసమీపంబునం గ్రీడించు చిలువతండంబులుం గలిగి నిరంతరదిగంతరాగంతుకయై దిశోద్ధరణకారణం బై మహామహిము బ్రవహించుచుండఁ దదీయంబు లగుకృతకతరంగిణీజాలంబులు కటిదఘ్నంబులుఁ బెందొడలబంటులు నై యెగనుబ్బి దిబ్బతీర్థంబు లై పొరలి తెరలెత్తి పల్వలంబుల వెల్లివిరిసియుఁ గమలకుముదకల్హారమకరందంబులం దుందిలంబు లగు కెలంకులఁ దొలంకెడుకొలంకులం బడియును ననకట్టలఁ దొట్టియు మొనసి పనసక్రముక నారికేళసహకారజంబీరజంబూతాంబూలవల్లీమతల్లికాకదంబంబులకుఁ బ్రోది గావించియు నిక్షుదండ మండితంబు లగుపాదులఁ బాదుకొనియును బాలుచొప్పరులఁ బరిపూరితంబు లగుచుఁ బెరిఁగి తట్టాఁగి పండి

మెండుకొని దుర్వహకణిశభారంబు లగుశాలికేదారంబులును, సుధాలిఖితశంఖచక్రంబులం గనుపట్టు బహిర్ద్వారకుడ్యప్రదేశంబులుం గలవైష్ణవులతిరుమాళిగెలును, నిరాఘాటఝుంఝూగంధవహారభసంబునకు బెదరి చెదరి పలాయితంబులై పవనభుక్పరివృఢంబుల మఱుంగుచొచ్చిన ఘనఘనాఘనంబులచందంబున భుజభుజంగంబులం బవమానంబు లగుతిరునామతిత్తులం జెన్నారు తన్నీరుదాసల్లును, నాంజనేయమహోత్సవంబుల కాటకూటంబు లగు......కూటంబులును, శిష్యప్రశిష్యపరివేష్టితోపాంతంబులగునయోమయశంఖచక్రముద్రాదండమండితహసంతికలసమీపంబులం బఱచిన నవరత్నకంబలంబులమీఁదఁ బద్మాసనాసీనులై నానారత్నసంకీర్ణంబు లగుమేరుగిరితటప్రదేశంబులం గనుపట్టు గండశైలంబులలీలఁ బ్రకాశించునాచార్యపురుషులును, బుణ్యపురుషధామం బగునీరంగధామంబున వసియించుపురుషులకుఁ బురుషోత్తమపదాప్తిం బగుటకు సందియంబు లేదని తెలిపెడుపోలుపున జలవిలిప్త......వెలుంగ శేముషీహారిశయ్యా లగుజియ్యలును, బ్రత్యక్షీకృతమోక్షలక్ష్మీవిశేషంబులం బోని యనశనవ్రతశుష్కీభూతంబు లగుమేనులుం గలకొత్తైమసానులును, జిత్రపటనిర్మితచలద్ధ్వజకలికాలంకృతంబులై కిసలయసంఘటితప్రగ్రహగ్రంథిబంధురంబు లగుటవలన నలుదిక్కులం బొలుచుజలరేఖలనంకితం బగునంబరంబుడంబువిడంబించుబోడచప్పరంబులునుం గలిగి రాజమందిరంబునుం బోలె నైష్ఠి

కాధిష్ఠితంబును, గగనమండలంబునుం బోలె వాజివిహారయో
గ్యంబును, గృష్ణాగమనంబునుం బోలె హరిభక్తవిరాజితంబు
ను, స్వాదోచిషమనుసంభవంబునుం బోలె వరూథినీప్రధానం
బును, మధ్యమపురుషహృదయంబునుం బోలె రాజసమా
నంబును నై హిరణ్యకశిపుచరిత్రంబు చందంబున ననహ్యాతన
యాభంగప్రవర్తమానాభిరామంబుగాక సహ్యాతనయాభంగ
ప్రవర్తమానాభిరామం బై, నహుషాహంకారంబు విధంబున
నహితాపాదనకారణంబు గాక హితాపాదనకారణం బై, పురు
షధనుఃకాండంబు కైవడి నమార్గణవిహారానుకూలంబు గాక
మార్గణవిహారానుకూలం బై, యోగిజనవర్తనంబుపగిది నభవ
నవ్యాపారవిభవాస్పదంబుగాక భవనవ్యాపారవిభవాస్పదం
బై యొప్పు నప్పురంబుఁ బ్రవేశించి. 14

—* విప్రనారాయణుఁడు పుష్పవనము నిర్మించుట *—

శా. ఆరాజీవభవాన్వయాభరణుఁ డాత్మారాముఁ డై యందుఁ గా
వేరీవార్యవగాహనంబుల మహావిద్వజ్జనాసక్తిచే
శ్రీరంగేశ్వరపాదపద్మయుగళీ సేవాక్రియాసంతత
ప్రారంభంబుననిత్యమాధుకరచర్యన్ ధన్యుఁడై యుండుచున్.

చ. పొలుపుగరంగధామునకుఁబువ్వులతోఁటయొనర్చితొంటి నా
కలిగినపాతకంబులు కకాపికగా విడనాడి బ్రహ్మవే
త్తలఁ గని ముక్తిఁ గాంతు నని తత్పురిపశ్చిమసీమఁ గాంచె ని
ర్దళితసమస్తసాధుపరితాపము శ్రీమకుటాంతరీపమున్. 16

క. కని యాదీవికిఁ జేరం
జని యమ్మునివరసుతుండు సహ్యమహీభృ
త్తనయాతటము తలంపున
కనుకూలము సమతలంబు నతులం బనుచున్. 17

గీ. గ్రామనికటంబు గాక దూరంబు గాక
చాటిపొర గాక చిట్టూటచోటు గాక
వెల్లితల గాక క్రీఁజెద ల్వేరుపురువు
రాతిపోటును లేని బారాటినేల. 18

క. ఫూనిక గడచన విష్వ
క్సేనప్రార్థనము సేసి చేకొని యచ్చోఁ
గానంబడు చెట్టుసేమలు
గానం బడ నఱికి కంపగట్టిన పిదపన్. 19

ఉ. ఆయనఘుండు దారుజలయంత్రముచేతఁ గవేరకన్యకా
తోయము లెత్తియెత్తి యొకతోయముగాఁ గనుజాడయెత్తియా
పోయి ధరిత్రి దాఁ దనివిపొందినదాఁకను నీళ్లు గట్టి ప
ర్యాయముతోడఁ బాటిపదనై యదనైనముదంబు తోఁచుతన్.

సీ. లుబ్ధకాద్భుతసితస్తబ్ధరోమాకృతిఁ
దలపోయుచును నేల ద్రవ్వి త్రవ్వి
సింధుగర్వహపంక్తికంధరారిధ్యాన
కలితుఁడై కట్టలు గట్టికట్టి
యందమొందఁ గళిందనందినీభేదికిఁ
దెలుచుచుఁ గాలువల్ దీర్చితీర్చి

చక్రి త్రివిక్రమవిక్రమక్రీడలు
గొనియాడుచును మళ్లు గొలిచి కొలిచి
మిట్టు పల్లంబు లెల్లను మెలఁపుతోడ
సరసి నాలుగుమూలలుఁ జదునుగాఁగ
నేర్పుతో నాలవాలంబు లేర్పరించి
తమిని నానాఁటికిని వానితతి యెఱింగి. 21

క. కొన్నిటికి నారు నాటుచుఁ
గొన్నింటికి నంట్లు పాదుకొల్పుచు మఱియుం
గొన్నిటికి విత్తనములు త
గన్నాఁటుచుఁ దోఁట సేయఁగడఁగినయంతన్. 22

ఉ. నీటను దేవమెక్కి ససి నిల్చి యొకించుక వాడుదేఱి య
ప్పాటున వేరువాఱి ధృతిపాటవమొప్ప నతం డొనర్చు న:
ప్పాటునఁ జెన్నుమీఱి పరిపాటిగఁ గెంజిగు రక్కడక్కడ
మోటిక లెత్తి క్రొవ్విరులు మొగ్గలు వెగ్గలమయ్యె నయ్యెడన్.

క. అమరఁగ లతికలు దరువులుఁ
దమరపమై మిసిమి పసిమి దగ్గక మిగులం
గొమరై ప్రొద్దొకచాయల
గుమురై మొలదోఁట యనలుఁగొనలుం బాఱెన్. 24

వ. వెండియుం జకచక ప్రభాభరిత జాలకంబు లగు వకుళజాలకంబులును, బరితఃపరీత పరిమళమిళిత పరాగంబు లగుపున్నాగంబులును, దరవికచప్రసవమంజరీ మంజుళంబు లగు వంజు

శంబులును, గిసలయశ్యామాయమానంబులై వెలసి యొం డొంటిం గలసి మెలసి విలసిల్లు తులసియును, నిజవాసనాకం దళితసకలజనానందంబు లగుకుందంబులును, విరిదేనియలసో నలాం దోరంబు లగుకరవీరంబులును, నిరంతర భ్రమరీగానంబు లగుపాటలీవితానంబులును, విరికెలంకులం బొదలు గొజ్జంగి పొదలును, సాయంతనసమయవికసనంబు లగువికచవిచికల నిచయంబులును, మీఱు కురువేరును, నంకురితగంధపదంబు కదంబంబు లగులామజ్జకస్తోమంబులును, మితిగడచి లతికల కెల్ల నేలిక లగునవమాలికలును, వికస్వర ప్రసవగేయంబు లగు చాంపేయంబులును, నరవిరి విరులం గొఱలి యితరసౌరభలో లుభ ద్విరేఫంబులకు వల్లియ లగుబొండుమల్లియలును, నరు ణావృంతాంతభారంబు లగుమందారంబులును, బరువం బగు మరువంబును, గర్భదళసౌరభ్యనిలయ మలయానిలాహూత వ్రాతం బగుకేతకీజాతంబును, రాలచ్చికి రచ్చ యగు పచ్చ యును, విరహిణీజనకంటకంబు లగుకంటకంబులును, నయ నానందసంపాదు లగుజాదులును, నాదిగా సల్లలిత పల్లవిత కోరకిత ప్రసవిత లతికాతరుషండంబులు తండతండంబు లై ప్రపీలితచ్ఛాయాజాలంబులు నిగుడం బొగడం దగి ఖరకరకిర ణప్రకాశంబులకు నిరవకాశంబు లై చలువలం జెలు వమరి పథికజనపరిశ్రమం బపనయించుచు సకలసౌరభాభిరామం బగునారామంబుం గనుంగొని పరమానంద కందళితహృద యారవిందుండై యవ్విప్రనందనుండు.

క. అరవిరు లగు నేఁబెట్టిన
తరువాటికవిరుల రంగధాము రమేశున్
హరిఁ బూజింపఁగఁ గంటిని
జరితార్థుఁడ నైతిఁ దపము సఫలం బయ్యెన్. 26

మ. అని గొజ్జంగులచెంగట న్సురభిళం బై దట్టమై చెట్లఁ బ్రాఁ
కినయాచల్లనిమాధవీలతలచక్కిం జొక్కమై యుండ నే
ర్పునఁ గావించిన పర్ణశాలకడ నేప్రొద్దుం బ్రవర్తించుచున్
ఘననిష్ఠామహిమం దనర్చి మురజిత్కైంకర్య ధౌరేయుఁ డై.

చ. పొలుపుగ నీరుకావిపటముం గటిఁ బింజె మడంచి కట్టి విం
తలు దళుకొత్తుచుండఁ దిరునామముఁ జాఁది తదంతవీథిఁ గ్రే
వలను దశావతారములు వ్రాసిన బిల్వకరండమందు రం
జిలుతిరుచూర్ణ మార్ద్రముగఁ జేసి శలాకను రేఖ దీర్చుచున్.

చ. అనఘుఁ డతండు నిత్యము నహర్ముఖకృత్యము లాచరించి పా
వనమతి జిడ్డు లేక కయివ్రాలక వాడక తావివోక ప
చ్చనిపసిమొగ్గ గానిదగుసావిని మేలిమి నేర్పరించి గ్ర
క్కునఁ బరువంపుఁ గ్రొవ్విరులఁ గోయుచు వంశపుటీతలంబునన్.

క. సురభిళతులసీపరిమళ
పరిమిళితములుగ నొనర్చి పరిపరిగతులం
గర మరుదుగ నతిచతురతఁ
గరకుశలత మెఱయ మాలికలు గట్టి తగన్. 30

క. తిరువాముడి పఠియించుచు
హరిభక్తులఁ గన్న భక్తి నడియఁడ సనుచున్

శిర మటు వచుచుఁ బ్రాకృత
పురుషుల యెడగలుగ దూరమునకుం జనుచున్. 31

శా. శ్రీరంగేశ్వరదివ్యగేహమునకుం జేరంగ నేతెంచి త
త్సారంగాంకదినాధినాథనయనుణ్ దర్శించి యందంద వం
దారుం డై తనచేత నున్నసుమనోదామంబు లర్పించి ధ్యా
నారూఢస్థితిఁ గొంతసేపచట నాత్మారాముఁడై యుండుచున్.

చ. మరలి వసుంధరామరకుమారుఁడు వైష్ణవరాజమందిరాం
తరముల కేఁగి యందుఁ బ్రయతం బగుమాధుకరంబుఁ దెచ్చి శ్రీ
హరికి సమర్పణం బని తదన్నము సాపడి శేవగల్గు దా
వరముగనుండెనయ్యుటజవాటికఁదోఁటకుఁ బ్రోదిసేయుచున్.

—* శ్రీహరి లీలావినోదము *—

క. ఈలీల నిజపదార్చన
కేళీతత్పరత నతఁడు గిఱికొని యుండన్
నాళీకగేహినీకుచ
పాళీలోలుండు రంగపతి మదిలోనన్. 34

ఉ. ఆజలజాసనప్రముఖు లైన సుపర్వులు భక్తియుక్తి నెం
బూజలు చేయరో మఱి తపోమహిమం జరియింపలేదొ యే
పూజలు నేతపంబులును బోధనిధాన మితం డొనర్చు నీ
పూజకు నీతపంబునకుఁ బోల్పుగ నెందును సాటి వచ్చునే.

చ. అనుచును సంతసించి తన దైవవినోదముఁ జూపఁ గోరి చ
క్కని దగు నింపుజవ్వని నొకానొక యచ్చరపూవుఁబోఁడిఁ జ

య్యన హృదయంబునం దలఁచినంత నె సమ్ముఖమందునిల్చి వం
దన మొనరింపఁ జూచి యెలనవ్వు కనుంగవ నంకురింపఁగన్.

సీ. కమలనేత్రి! కవేరకన్యాతరంగిణీ
వరతటంబునకు నుత్తరమునందు
బహుభోగరాగసంపన్నమై యున్నత
ప్రాకారగోపురభరిత మగుచుఁ
గను పట్టు సర్వజ్ఞమను పేర దేవతా
స్థానమందిర [1]… … …
… … … … … … … … …

ఉ. లాలి మనోహరాంగి శుభలక్షణలక్షిత లాలి లాలి యో
లాలితనీలనీలకచ లాలి యటంచు సువర్ణడోలికాం
దోళనఖేలనంబులను నున్నన నిద్దుర సోలగింప నా
బాలికఁ బాడుచుండుదురు పాటలగంధులు జోలపాటలన్.

—* దేవదేవీసౌందర్యవర్ణనము *—

క. తరుణివిలాసం బెన్నం
దరమే పరమేష్ఠి కైనఁ దలఁపఁగ నోహో
హరిమధ్యం బఁట బంధుర
కరిగమనం బఁట విచిత్రకర మిది గాదే! 39

చ. మొలకమెఱుంగు లింపడర మున్బదరీఫల మౌట వెన్క నా
మలకఫలస్వరూపము గ్రమంబున నౌట ననంతరంబు శ్రీ

1. ఇచ్చటినుండి యైదాఱుపద్యములు పోయినవి.

ఫలఫలరూప మాట బహుభంగుల నెన్నఁగ నిక్కమే చుమీ
జలరుహనేత్రి చన్గవ భుజంగతపఃఫలరూప మాటయున్. 40

ఉ. తిన్ననిలేఁతసోయగపుఁ దీఁగెలు కన్నియచేతు, లిట్లు గా
కున్న సరాగపల్లవవయోరుచిరూపము లౌనె, కంకణా
భ్యున్నతిఁ జెందునే, చెలువుఁ జెందునె [1]వేళ్లను గఖరోచిరు
త్పన్నవిలాసరేఖ గనుపట్టునె, కొమ్మకు వన్నె పెచ్చునే! 41

క. అందంబున నలవలమురి
చిందంబు ముకుందుఁ డర్థిఁ జేపట్టినద
న్నందున కెఱుఁగముగా కీ
యిందీవరనేత్రిగళము నెనయంగలదే. 42

గీ. కలికికనుఁగవ యబ్జవిఖ్యాతిఁ దనరు
బింబమును మోవి తావిడంబించిమించు
దాన నంబుజవైరిచందంబు గెల్చు
దా ననఁగఁ బొల్చు నా ప్రమదాననంబు. 43

క. జలచరములు తలచూపక
కళవళపాటునఁ జెలంగుఁ గన్నులసమతన్
జలరుహదళములు చిలుకల
కొలికిం గనుఁగొన్న నొక్కకొలికికి వచ్చున్. 44

ఉ. ఎంచఁగ మేచకద్యుతి వహించుట సోఁగ లనంగఁ దాము రా
ణించుట నెమ్మిమోఁగడు గణింపఁగఁ బొల్చుట దా విభూతిచే
మించుట నాలతాంగినునుమించుకురు ల్సరులై తనర్చియుం
బించెము లై చరించె ననిపించె ఘనాఘనజిద్విలాసతన్. 45

1. వ్రేళ్లను- మూ.

క. పలుకొలమున మేలగు చెలి
పలుకులకును గప్పురంపుఁబ్రతిగాఁ దమ్ముం
బలుకు లనవలసెఁ గాదేఁ
బలుకుల నమ్మృగమదాది పదములు గలవే! 46

ఉ. ఆనలినాక్షి చూడఁ దమిదైయె కనుపట్ట విభావరీకరుం
డాననబింబ మయ్యెఁ, గురులయ్యెను గందు, సుధాధరా(ధర)
శ్రీనిగిడించె మున్న దనుఁజెందిన కెంపు, కృశత్వ మెల్ల నా
హానము మయ్యె, దానిదరహాసము వెన్నెల గాక యుండునే!

వ. ఇట్లభినవరూపరేఖావిలాసంబులకు నావాసం బై, సాహితీ
నృత్యగీత ప్రసంగావధానంబులం దనకు నెదురు లేకయుండం
బెరసి రసికతావిశేషంబులం గురు కుకురు కరూశ మగధ మా
ళవ చోళ ప్రముఖ దేశాధినాయకులచేత వాదంబులం బవా
డంబులం గొనుచు సోదరీ ప్రముఖ నిఖిలసఖీజనపరివృత యై
మగిడి శ్రీరంగసమీపంబునం జనుచున్న సమయంబున. 48

—* వేసవి వర్ణనము *—

సీ. అధ్వన్యభిజ్ఞశ్రమాధ్వన్యసంఘంబు
ప్రతిపద్ధతిప్రపాపరికరంబు
పల్వలోదస్వయంపచ్యమానఝషంబు
బహుభిదేళిమశిరఃపటలరురుక
మస్తముస్తావిహస్తస్తబ్ధరోమంబు
కీచకనికషణోద్గీర్ణదవము

పరితోవిభిన్నభూపదదృష్టపాత్రాళ
మూనాభిగళనీరసాచ్ఛభల్ల
ముదరభాగ(ప్రపూర)ణోద్యోగవిముఖ
వమధువిరహాలాన్నమత్తరవ్యక్తవిటప
కించిదాతపహృద్వనీసంచరిష్ణు
మదగజేంద్రంబు వేసవి యెదురుకొనియె. 49

ఉ. ఏచినఘర్మవాసరము లెవ్వఁడు నేర్చుఁ దరింపఁ దత్సుధా
సేచన మొందియుం జలువఁ జెందియు రాజునునుండ దర్శవే
ళాచకితంబులై మునుపు లావుగ నెండలు గల్గు వేండ్రముం
జూచిన వౌటఁ గాదె తలచూపవు వెన్నెలలుం దివంబునన్.

మ. సెకలూర్పుల్ బుసకొట్టు పాన్పుగలరాజీవాక్షుఁడుం జేఁదు కు
త్తుకనుం గల్గిన వేల్పు మున్నలుగఁ బాథోరాశిలో నుండఁ గై
శికమందున్నది దాల్ప బా మిపుడు గాచెం గాక కాకున్న నిం
తకు నేమాదురో నేఁడు వేసవిని మార్తాండాతపజ్వాలలన్.

సీ. కర్పూరశకలసంగతవీటికాచర్వ
ణములఁ జక్కెరపానకములవలన
మిసిమితావులఁ గదంబించు గంధంబులఁ
దేటకట్టాణిముత్తెంపుసరుల
శైత్యబంధురగంధసలిలగండూషల
నభినవతాలవృంతానిలముల
జిలుఁగుఁజెంగావిమవ్వలువల నాసీత
శీతలనీహారసేచనముల

మఱియుఁ గల్గినవస్తుసంపదలఁ బొదల
నయినఖేదంబులకుఁ బ్రతిక్రియలు గొన్ని
కొన్నివిధములఁ దగియెడుకొలఁది నపుడు
కువలయేక్షణ లొనరించికొనుచుఁ జనుచు. 52

ఉ. కగ్గిన [1]గోములుం, జెమటగాఱెడు మోములు; వాడి వత్తలై
తగ్గిన మేనులు న్వణఁకు దార్కొను కౌనులు సారెసారెకుఁ
మ్రొగ్గెడు పాదము ల్కనుల మూఁచినఖేదము లెండసోఁకుడు
ల్వెగ్గలమైన యూర్పులును విన్నని[2]తీర్పులు గానిపింపఁగన్.

క. జలదాకృతి ధృతతులసీ
దళదాముఁడు రంగశాయి, తద్దయు తనపైఁ
గలదాయె నేని యుండ
న్వలదా యీయెడ నొక్కవన మీఁదుండన్. 54

చ. అనుచును దేవదేవి మొదలైన మృగేక్షణ లొయ్యనొయ్యనం
జన ననుపాత్తపూర్వ మనిజస్థితిదూర మథఃకృతాతపం
బనవసరాగతం బవిదితాత్మజనుస్స్థల మప్రచోదితం
బనితరలభ్య మప్రతిహతార్జవ మత్వరితాగమంబునై. 55

సీ. కొలనిషట్పదయామికుల నెల్లఁ గనుఁబ్రామి
ననగురివెందకన్నానఁ దూఱి
పొగడలకమ్మపుప్పొడి చొక్కుపైఁ జల్లి
గృహమేధిపికములఁ గికురువెట్టి
విరిదమ్మిచెత్తావి సరగున గిలుబాడి
పటువైన చిగురుజొంపములు నెమకి

1. కౌనులు-మూ. 2. మోములు-మూ.

పొన్నలమకరందములు చల్లుపోరాడి
తెలిమించు మల్లెమొగ్గలఁ దెరల్చి
యలబలముసేయు శుకశారికల నదల్చి
శౌర్యహృతవస్తుధృతపరిశ్రమము మీఱ
విప్రనారాయణారామవీథి వెడలి
యలసగతి వచ్చె మందమందానిలంబు. 56

క. వడదేఱఁ గొంత యలసత
లుడిగెఁ మొగములను దెలువు లొందెను డించె
న్వడిఁ జెమటయు జిహ్వాలకుఁ
దడి వచ్చెం బవనురాకఁ దరుణుల కెల్లన్. 57

క. మరుదంకురదరవిచల
ద్గరుదంచలచంచరీకకాంతనితాంతాం
తరుదంచితపరికుంచిత
తరుదంతురదళలతాంతతాంతప్రాంతిన్. 58

ఉ. తోరపువేడ్కసేయు నెలదోటఁ గనుంగొని దానియున్న శృం
గారము పుష్పమంజరుల కమ్మనితావులు భృంగరాజముల్
గేరెడు సొంపు నింపు గలిగింపఁగ హాయని చొక్కి యాదరం
బారఁగ దేవదేవి తనయగ్రజ కిట్లనియెం బ్రియంబునన్.

శా. అక్కా యీగురివెందహందిరులచాయం గంటివే మంజరుల్
దిక్కూలంకషకాంతితో మనల నుద్దేశించి సౌరభ్యముల్
బుక్కాముల్గ నొసంగుచు న్ననుచంబు ల్దాల్చు ఘర్మాంబువుల్
దక్కం గైకొనె మైత్రిచే ననఁగఁ జూడుం దేనియల్ గ్రమ్మెడున్.

క. గొనబు లగుచిగురుమామిడి
ననమొగ్గలు మొగ్గ లనుచు నమ్మం దగ దో
వనజేక్షణ యివి గావా
పనివడి తా మతనుఁ బోటుబంటుం జేసెన్. 61

మ. హరిణీలోచన కంటివే యెదుట నొయ్యారంబుగా సౌరభో
త్తరగుంజాతరుసీమఁ దెమ్మెరల రాక న్వ్రేఁక నల్లాడు క్రొ
వ్విరితీఁగం గని యొక్కరాచిలుక తీవిం బోటు లీక్షింప నం
దిరవై యుయ్యెల లూఁగుచున్న యదితా యిన్దుమ్మెదల్పాడఁగన్.

క. గామిడి డిదె గండుఁదుమ్మెద
మామిడి విరితేనె లాను మఱియొకతె చనం
గామిడి వాడిచిన నావలి
మోమిడి తాఁ గ్రోలె నిందుముఖి కనుఁగొంటే. 63

వ. అనుచు నయ్యెలజవ్వను లవ్వనవిలాసంబులకుఁ జొక్కుచుఁ
బెక్కు చందంబులఁ గొనియాడుచు నెడనెడ సోఁకులఁ గడ
లుకొను నొడలిబడలిక లెడలించుచు నెడనెడ శీతలతరు
చ్ఛాయామండపంబులం దలిరులశయనంబుల శయనించుచుం
బురస్కృత తిరస్కరిణీ పరిసరంబుల భాసిల్లు లాస్యకీజనంబుల
చందంబునఁ బుష్పితలతాకుంజంబుల సందుల నాదంద తె
ల్చుచుఁ జెలికత్తియలం బిల్చుచు సాయంతన జలధరంబుల
మఱుఁగుననుండి యొండొండ వెడలు క్రొమ్మెఱుఁగుల తెఱం
గునఁ జివురుజొంపంబులం బొదలు పొదలు వెలువడి తళు
క్కునఁ బ్రకాశించుచుం గుఱంగట మధ్యప్రదేశంబులు ప్రవే

శించుచుఁ గెందమ్మికొలంకుల కెలంకులఁ జరియించు రాయం
చలచందంబున మకరంద ఝరసనీడంబుల నడయాడుచుఁ
బాడుచు మొత్తంబు లగు జేగుఱు నెత్తంబుల కరిగెడు మయూ
రవనితలచొప్పునఁ బుష్పొడితిప్పలఁ బరిభ్రమించు మదభ్ర
మరంబులఁ జూచుచు రాచిలుకలవలెం గిలకిలం బలుకుచుం
జనిచని. 64

సీ. అలవిఘ్నంతుదునిచే నగుతాప మాఱదే
హరిణాంకుఁ డిది చూడఁ డయ్యెఁ గాక
కాలకూటానలగ్రసనార్తి మానదే
పురహరుఁ డిటు రాకపోయెఁ గాక
బడబాగ్నిశిఖలఁ జొప్పడుపాటు దీఱదే
జడధి కియ్యనికి చేపడదుగాక
తపనుఁడు మార్గఖేదము పీడనాడఁడే
లీల నిందు వసింపలేఁడు గాక
యనఁగఁ జలువల నెలవు వాసనల కిరవు
నిబిడమును నైనద్రాక్షపందిరులచక్కి
నున్న యొకకన్నెసురపొన్నగున్ననీడ
జలరుహేక్షణ లుబుసుపోకల వసించి. 65

చ. ఇల నితరంపువాసనల నెల్ల నుచుక్కనిపించు చున్నదీ
లలితలతాంతగంధము, కొలంకులఁ దేఁటులపాట వల్లకీ
కలకలరావముల్ చెలువుగా వినిపించె లతాంగులార ! యీ
చలమరిగాడ్పులం గలుగుచల్లఁదనం బిఁకఁ జెప్పనేటికిన్.

క. అనుచుం జిలుకలపలుకులు
వినుచుం బూఁబొదలఁ బొదలు విభవంబుఁ గనుం
గొనుచుఁ గొండడుగులు నట
చనుచుం బన్నిటికాల్వజాడం జూడన్. 67

—* వేశ్యలు విప్రనారాయణుం గనుఁగొనుట *—

సీ. తొగజేనిలోకందు దిగజాఱె ననఁగ మొ
గమ్మున బవిరిగడ్డమ్ము మెఱయ
నుదయాద్రిశిఖరంబుతుద భానుబింబంబు
సాటి నొందలఁ గావిశాటి వెలయ
బొమల నెన్నడిమి పద్మముదళంబుల రేఖ
రహిఁజూపు నూర్ధ్వపుండ్రంబు నిగుడ
లో నిడి హరిభక్తి పైని ముద్రించెనా
శంఖచక్రములు భుజములఁ జెలఁగఁ
ద్రిపథగాభావ మొకచోటఁ దెలుపుచున్న
త్రిదశనదివోలె నలుత జన్నిదము దనరఁ
బూర్ణతరుమూలజలకుంభముల గణించు
సరణితోడుత మాధవస్మరణ మమర. 68

మ. అలమాకందముకుండ్లదింపఁదగు,నియ్యంట్లొక్కచో వేయఁగా
వలె, సంపఁగికిఁ ద్రవ్వటం బిడవలె, న్నాసంతికల్ నేఁడు గూఁ
డులు గట్టం దగుఁ, గన్నెగన్నెరులు వాడుం దేటెనంచు న్వనిం
గలయంగన్గొనువానిఁజూచి రెలనాఁగల్ విప్రనారాయణున్.

చ. కనుఁగొని తన్మృతండు కడకంటను జూడక యొక్కచీరికిం
గొనక వచోవిలాసములకుం జెవి దేలగిలంగనీక యా
నన మరవాంచి తోఁటపయి నాటినకోర్కుల నిర్వికారుఁ డై
యునికికి విస్మయం బొదవ నగ్గలి సోదరివంకఁ జూచుచున్.

ఉ. అంగన నీవు వీనిహృదయంగమమోహన[1]రూపరేఖ లె
ల్లం గనుఁగొంటివే కిలకిల న్నగు క్రొన్ననవిల్తు నైన, నీ
యంగము(శ్రేవ్యకు) దగినయందముగా దితఁ డున్నవేష మై
నం గలఁకం దలంకదు మనం బిటు వచ్చుట కెంతవింతయో!

సీ. జటియునై ననవిల్తుకుట మణంచినస్వామి
దారువనక్రీడఁ దగిలె ననఁగ
శుచి యైనయవ్వేల్పుచూపు తాపసకుల
స్త్రీలపై వలపులఁ జిక్కె ననఁగ
వానిశిరోరత్న మైనయాద్విజరాజు
గురువధూటికి మరుల్గొనియె ననఁగ
నమరులకును బెద్ద యతనిసారథి వాల
ఖిల్యాదిమునులఁ గల్గించె ననఁగ
వీనికథ యెంత యెన్నంగ వీరిలోన
నెవ్వరిని బోలు మహిమల కెంతదవ్వ
విప్రసామాన్యుఁ డూరకే విఱ్ఱవీఁగు
చున్నయంతనె యధికుఁ డౌనొక్కొ తాను. 72

క. నామములు దీర్చి తులసీ
దామంబులు వైచి చేలతనమునఁ దగు నీ

1. హృదయంగమనోహర-మూ.

సాములె కారా మగువల
బాములఁ బడువారు వేషభాషలు గుఱుతే! 73

సీ. అందెలరవలి విన్నంతనే పోయెనే
చిరకాలనియతిఁ జేసినతపంబు
మనలను నిటు గనుంగొనినంతమాత్రనే
తఱిఁగెనే హరిపదధ్యాననియతి
యేమని మాటాడ నెన్నంగఁ దొడనే
పోయెనే తనవ్రతంబులు కొఱఁతఁ
గటకట యిటు గుఱుంగట నిల్చినంతనే
పొరయునే షట్కర్మములను హాని
ఘనతపోరూఢి నధికులు గలరు గాని
యిట్లు చరియించు నియతుల నెందుఁ జూడ
మిదియు వర్తన మైనచో నిగురుఁబోఁడి!
కౌశికాదుల కూర్ధ్వలోకములు లేవె! 74

ఉ. పాటలగంధి! సౌఖ్యపరిపాటి యెఱుంగనియూఘఁ డొట నే
పాటియు వీఁడు తాఁ దనకె పైకొనఁ డాయెనుగాక కాక నా
పాటల నాటల న్మధురభాషలఁ జొక్కి లతాంతబాణుచే
వాటులఁ జిక్కి కౌఁగిగురుఁబానుపుఁ జెందక యుండ శక్యమే.

వ. అనుటయుఁ గటకటంబడి యక్కుటిలకుంతల చెలియలిం జూచి
యిట్లనియె. 76

చ. హరిహరి! యెంతమాట! యెటులాడితివేతరళాయతాక్షి! కా
పురుషులఁ బల్కిన, ట్లఖిలభోగములు న్విడనాడి సత్క్రియా

నిరతిని బ్రహ్మచర్యసరణిక్ (మహనీయతపో) మహత్త్వముం
బొరసినయట్టి యిట్టిమునిపుంగవుభావ మెఱుంగ వేమియున్.

క. ఏమరుదే యితఁ డెక్కడి
పామరుఁడే నిలువు నూరు పండినరీతిం
దామరవిం దన నున్నాఁ
డోమరువపుమొలక ! యెట్టియోగివరుండో. 78

సీ. తెలిమించుమెఱుఁగు రంగులువారఁ గట్టక
కాషాయములు దాల్పఁగాఁ బనేమి
నెలవంకతిరుమణి నీటుగాఁ దీర్పక
పెనుపట్టెనామముల్ వెట్ట నేమి
గోనబుమీఱఁగఁ గోరకొప్పు దిద్దక నెరుల్
జడ గట్టఁగా నీళ్లఁ దడుప నేమి
గోవాళ్లతోడుతఁ గూడియాడక తోఁట
గావింతు నని యిట్లు గడఁగ నేమి
వికచనానాప్రసూనమాలికలు చాలఁ
గలిగి యుండఁగఁ దులసిపూసలసరంబు
వైవనేమి మహాయోగివరుఁడు గాక
మగువ యీయన యితరసామాన్యుఁ డైన. 79

క. రాగంబు నొడిచి ముక్తి
శ్రీగౌరవముల కపేక్ష చేయుమునులకున్
నాగేంద్రయాన ! యైహిక
భోగం బిది మేఢికాయబోనంబు సుమీ. 80

—* వేశ్యలు పంతములు వేసికొనుట *—

క. వలవనిమాటలు సారెం
బలుకం బనియేమి హావభావవిలాసా
దుల నీ వితనిం గరంచిన
నలికైశిక యేను దాసి నయ్యెద నీకున్. 81

మ. అనుషంగింపుమెఱుంగుకన్నుఁగవచాయల్ జేవుఱింపంగనుం
గొనియొక్కింౘుకజాఱుపయ్యెద చెఱంగుల్ రంగుగాఁజేర్చి కొ
ప్పును జక్కన్సవరించి యౌవనమదంబు న్సత్కళాప్రౌఢియుం
దనరన్దొయ్యలిరెండుమూఁడడుగులంతల్ డాయఁగానేఁగుచున్.

చ. పని మఱి లేనికోడిగపుబాఁపని నీ వొకప్రోదిసేసి పే
ర్కొని మును నావిలాసగుణరూఢి నెఱుఁగనియట్లు పన్నిదం
బని కడు మించ నాడితివి యాడినమాటకుఁ దారసిల్లినన్
వెనుకకుఁ బోకుమంచుఁ జెలి వేఁడియు జంకెన లుల్లసిల్లఁగన్.

సీ. మాధవస్మరణంబు మాన్పి కొక్కోకాది
పఠనంబునకుఁ బాలుపఱుపనేని
కనుసన్నసేసి యాకడవనె నాయింటి
కెల్లను నీళ్లు మోయింపనేని
తిరుచూర్ణరేఖ మచ్చరణలాక్షాలక్త
దృష్టితో వియ్యమొందింపనేని
మునిపండ్లఁ గొఱికివైచిన నాగవల్లికా
దళములకై యాసగొలుపనేని

కలఁప నేనియు వలవంతఁ గఱప నేని,
కేళి కెలయింప నేని చొక్కింప నేని
విటుల కెకిమిాని వీనిఁ గావింప నేని
యుగ్మలీ! నీకు దాసి నై యుండుదాన. 84

వ. అని యమ్మంజులాలాప కెంజిగు రంటినచందంబునఁ గేలుం గెందమ్మి నగ్రజహస్తంబునం బన్నిదం బని చఱచి యనుచరని చయంబులతోడం గూడ నిజనగరంబున కనిచి ననిచినకుతు కంబునం గపటనటపరిచయంబునం గాని వీనిం జొక్కింప రా దని వితర్కించి కుఱుంగటం గురవకలతావలయంబునం గిసల యప్రసవమంజరీరంజితం బగు నొక్కతరుకోటరక్రోడంబునందు.

క. అరవిందనయన శోభా
కరము ల్మణికింకిణీనికరము ల్మణినూ
పురముల్ చీనాంబరము
ల్సరము ల్హర ముల్లసిల్ల శాటిం బెట్టెన్. 86

గీ. చాతురీరీతి వేర్వేఱ సంగ్రహించి
వనిత యొక జీనిపావడ వానిమిాఁద
ముసుఁగువడఁజుట్టి పైలక్కముద్రఁ బెట్టి
యొరులు గనకుండ నలుదిక్కు లరసిచూచి. 87

శా. నాభాగప్రతిమాన దానజితకర్ణస్వర్ణగోత్తంస ధా
టీభీధావితజాత వేపథువధూటీచిత్తవైకల్యదీ
ప్తాభీలానునయానులాపకబళీవ్యాపార సౌభాగ్యధా
త్రీభూభృత్తులవైరి మోహనమురారీ రాజకంఠీరవా! 88

క. తుక్ఖారధట్టఘనజవ
యుక్ఖురజరజఃపలాయితోదితరక్షా
రక్షవచోరిపుయాచిత
మక్షాకటకాదిరాజ్య మహిగృహమేధీ ! 89

పంచచామరము. అహంక్రియాసమగ్రవిగ్రహస్థలీభటానటీ
మహాహళాహళీవిహారమంత్రయంత్రకల్పిత
స్పృహాస్వయంగతానురాగహృజ్జయాంగనాముహు
ర్ముహుర్భుజోపగూహనానుమోదమానమానసా ! 90

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహ
ధ్యానానందసౌందర్యధుర్య ప్రబంధపరమేశ్వరవంశపవిత్ర
లింగనమనీషిపుత్ర శ్రీకాళహస్తీశ్వర దయాసహాయ చదల్వా
డ మల్లననామధేయప్రణీతం బైన విప్రనారాయణచరిత్రం
బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# విప్రనారాయణచరిత్రము.

## తృతీయాశ్వాసము.



క. శ్రీబంధురమందిర బిసి
జబాంధవతేజ త్రిభువనీగండరగూ
ళీబిరుద స్వత్కృపాంబుని
ధీ బుధనుత మాకరాజుతిమ్మనృపాలా! 1

గీ. అవధరింపుము కని భూషణాంబరాదు
లీవిధంబున దాఁచి తా దేవదేవి
తాను వైష్ణవురాలిచందంబుఁ బూని
చాలఁ దగినట్టి సంజోక సవదరించి. 2

—* దేవదేవి విప్రనారాయణుం జేరుట *—

సీ. మెఱుఁగులు పైకిఁ గ్రేళ్లుఱికెడు గబ్బిగు
బ్బలమీఁదఁ గావికుప్పసము దొడిగి
యడఁచి క్రొమ్ముడి బయల్పడకుండఁగా ఖండ
శాటి యౌఁదలను మించఁగ బిగించి
బెళుకుఁజూపులఁ గెలఁకులు దాఁటఁగా నీక
నిజపదనఖరేఖ నెలవు కొలిపి

హరినీలములయొప్పు నడికించు కెందమ్మి
జమిలిపూసలకంటసరి యమర్చి
యల్లనల్లన హరిహరిహరియటంచు
గోలయునుబోలె నొదుఁగుచుఁ గొదికికొనుచు
విష్ణుపదభక్తి మూర్తీభవించె ననఁగఁ
జకితహరిణాక్షి దాసరిసాని యయ్యె. 3

క. ఇటువలెఁ గుహనానటనా
ఘటనాపర్యటననటనకౌశలయై య
స్నటదిందిందిరకుంతల
యట చని కర్పూరకదళికాంతరవీథిన్. 4

చ. ననిచినగుజ్జుమావికెలనం దగుగంధపుమ్రానికొమ్మలం
బెనఁగొని యున్నమల్లికలపెక్కువ గన్గొని నీళ్లు గట్టి సం
జనితకుతూహలాంకురము శాఖలువాఱఁగ వచ్చుచున్న య
మ్మునికులసార్వభౌముని ముముక్షువరేణ్యు మహానుభావునిన్.

చ. తనమది భక్తి గల్గినవిధం బటు దోఁపఁగ దవ్వుదవ్వులం
గనుఁగొని తత్పదాంబుజనఖప్రభ లొక్కట ఫాలపీఠి సోఁ
కను బ్రణమిల్లి యోమునిశిఖామణి! యోకరుణాపయోధి! యో
యినవిభతేజ! కావఁదగదే నను నార్త ననాథ నెంతయున్.

చ. అని కడు నాఁపఁగా భరములై లవలీదళగండమండలిం
గనుఁగవబాష్పముల్ దొరుఁగఁగా నపుడేడ్చెఁ జకోరనేత్రియుం
దన నిజసోదరీశపథతామ్యదహంకృతివాక్యవంచనా
ఘనకుహనావిహారపరికల్పితగద్గదకంఠవైఖరిన్. 7

గీ. అప్పు డాజంత పలుకువాక్యంబు లెల్ల
మనములోపల నిక్కంబు లనుచు వగచి
యబల! లే లెమ్ము లెమ్మని యాదరించి
యిట్లు పలికెను వాచంయమీశ్వరుండు. 8

ఉ. ఎయ్యెడనుండి వచ్చితివి యియ్యెడలన్ హరిభక్తురాల! పే
రెయ్యది? యార్తిఁబొందఁగత మెయ్యది? నీకును మే మొనర్పఁగా
నయ్యెడుకార్యమెయ్యది? భయంపడ కింకెఱిఁగింపు నావుడుం
దొయ్యలి చిక్కె దమ్మఁ డని దుర్భరహర్షనిమగ్నచిత్తయై.

క. దేవా! విన్నప మే మని
కావించెద నీదుసమ్ముఖమ్మున యావ
జ్జీవజుగుప్సాజీవన
జీవాతుఘనాఘహేతుశీలకులంబున్. 10

వ. అయినను నార్తజనశరణ్యుండ వగు నీ నిమిత్తంబునఁ గడ
తేఱఁగలదాన నగుట నాకలతెఱం గెఱింగించెద దత్తావధా
నుండ వై యవధరింపు మని యిట్లనియె. 11

క. నేరముల కునికి యాఱడి
కారయ విడిమట్టు వట్టియపకీర్తులకుం
జేరుగడ దోసములకు హ
జారము వెతల కిర వాఁడుజన్మ మదేలా! 12

ఉ. అట్టి మహావిహీనభవ మయ్యును నీలువు మాటవాసియుం
జుట్టఱికంబుఁ బుణ్యమును సున్నగ విన్నలఁ గూడఁ బెట్టుచో

గుట్టు దొఱంగుచుం బడుపుఁగూటికి నోఁచినవారిజాతినిం
బుట్టి క్రమక్రమంబునఁ దపోధన! యావన మావహిల్లఁగన్.
మ. కళలం దక్కఁ బెనంగి గానములఁ జక్కంజేసి లాస్యక్రియా
కలన న్మెచ్చుఘటించి నేర్పునను గాఁకల్ పుట్టఁగావించి మా
యల వంచించి నరేంద్రనందనుల నుడ్డాడించి సప్తాంగముల్
బలుసొమ్ముల్గొనిసంయమివా! యిడుపులుం బంగారుగాఁజేసినన్.
సీ. పెల్చ నల్లిండ్లు నిల్పెద నన్న నదలించుఁ
జెఱువు గావింప నెంచినను గసరు
వనము వెట్టింప నెంచిన నెంతలే దను
గుడికి యత్నముసేయ గొణఁగసాగు
బుధుల కీ వేఁడినఁ బ్రొద్దు వో దను నీకు
నతిథిపూజలకు మల్లాడఁ దిట్టు
దోసాన కలిగిన నోసి! పో లె మ్మను
బేదసాదలఁ బ్రోవ గీముపోరు
దేవ! యిటుగాక మఱియును లావుముట్టి
బలియు బికిరంబు జోగు గోపాళ మనుచు
వీథి కెవ్వారు నుడిసిన వెక్కిరించు
నయ్య! తనుఁగన్న కొయ్యగయ్యాళి తల్లి.
క. సామీ! పలుమఱు దేవర
కే మని వినిపింతు నింక నీఁగకు నిసురుం
బాముకు బలియుఁ బెట్టక
యాముసలికరాబి పిసిడిద్యె వర్తించున్.

సీ. వదనపద్మము పల్లవప్రకరోచ్ఛిష్ట
లాలితవీటీకలాచిఁ జేసి
గాత్రంబు జ్యాకిణీకర్కశభుజులైన
మగలకు గరిడికంబములు సేసి
కూర్మి యొక్కెడఁ బాదుకొననీని యార్జింపు
దొరలకు నిర్వ్వంకతుంగ సేసి
మొలకమెఱుంగుఁజన్నులు భుజంగనఖాంకు
శములకుఁ గలభకుంభములు సేసి
గట్టు నానయు విడనాడి కొంగుపఱచి
యగడువడి పడిచి పడసిన యట్టి పసిఁడి
కటకటా! యేమిటికి నెక్కె గడనవంక
నేమి గంటిని దోడుసు నా కేల యనుచు. 17

ఉ. ఏను విరక్తురాల నయి యిట్లు భవత్పదసేవ గోరి యో
మానికులావతంస! గరిమంబున వచ్చితి నాదరంబు లో
నూనఁగఁ జూచి నీ దయినయూడిగముం దయచేసి ప్రోవు నీ
యానతిపద్ధతిం దగ నహర్నిశముం బరిచర్య సేసెదన్. 18

సీ. నెఱినొప్పులకుచముల్ నీచేతఁ గాయలు
గాచెఁ బొమ్మనిపింపఁగలఁ గడంగి
చిన్నికొమ్మల మించు కన్నెమామిడి చెట్టుఁ
జేర్చి నీకును మెచ్చు సేయఁగలను
నెలమిఁబల్వరుసల నీమోవిఫల మంద
సొరిది నీకును జవిసూపఁగలను

బొగడను దగు విధంబులను బెక్కులు గల్గ
నలరించి నిను మరుల్గొలుపఁ గలను
జతురబహుబంధములఁ బరిచయము కలిమి
రాజయోగవిలాసాభిరామ నగుట
ఘనకళానుభవంబుచేఁ గలుగు నేర్పు
మించ నిన్నను గడకుఁ దేలించఁగలను. 19

వ. అనిపలుకుటయు జటివరుండు నమ్మాటువమాటలాఁడిపలుకులు నిక్కువంబులు గా వగచి విష్ణుకైంకర్యంబునకుం దనకు సాహచర్యంబు గలిగె ననుచు నంగీకరించి దానిం దగువిధంబునం బనిగొనుచు నేమంబునం బుష్పదామంబులు రంగశాయికి సమర్పించుచు మాధుకరచర్యాసంపన్నంబు లగునన్నంబులు భుజియించి యిష్టశిష్టౌదనం బయ్యింతికిఁ బ్రసాదించుచుఁ దన యుటజంబున కనతిదూరం బగునొకలతాకుటీరంబున నుండ నియమించె నివ్విధంబున నొక్కసంవత్సరంబు గడపినయ నంతరంబ. 20

—* సూర్యాస్తమయాదివర్ణనము *—

క. [1]గగనమణియేను చకి
దగదిన మిది నీదిగాదు తరుణీ యనుచున్
వగదేరు దనక యెడగై
గదవని పైఁబెట్టె నన నబ్ధిఁ దపనుఁడు గ్రుంకెన్. 21

1. అర్థము తెలియనందున నున్నట్లే విడువఁబడినది.

ఉ. నాదగుతారకారుచిధనంబు హరించిన కన్నగాఁడు వీఁ
డే దివసాహ్వయుం డగుకడిందిమలిమ్లుచుఁ డంచుఁ బశ్చిమా
శాదయితుండు చూడఁ గడసారి నవారణఁ జేలము వ్వియ
ద్వ్యాది కడంకతో ముడియు వైచె ననన్రవి గ్రుంకె నెంతయున్.

చ. తిమిరపుదాడికాఁడు చనుదేఱఁ దొడంగెను నా కెమర్పఁగా
సమయము గాదు గూఢతరచర్యను వర్తిలి వేగ వచ్చెదన్
రమణఁదమోనుదాశ్రయములన్నిలుమంచును నైజతేజమున్
గమలహితుండు నిల్పెననఁగాఁబొడకట్టెను సాంధ్యరాగముల్.

క. జలజహితభీతి నిల్లడ
నిలిపిన యయ్యిరులదొరలనిసువులు తఱిమై
వెలువడె ననఁ దొగమొగ్గల
నెలమ్మెదదిమ్ము లటు ఘరీయన వెడలెన్. 24

క. మురహరున కేకచక్రము,
సరసిజబంధునకు నేకచక్రము, కవయై
తిరుగుట కా దనుకరణిన్
సరసులఁ జక్రంబు లేకచక్రము లయ్యెన్. 26

మ. అహరంతావసరంబునందు నొకకల్హారంబుచక్కి న్ముహు
ర్ముహురిచ్ఛారతిఁ దేలి తేఁటిమిథునంబు గ్గార్గఁ దత్తద్గరు
త్పిహితంబై తగుతేనె వేఱొకటి యర్థింగ్రోలెఁ దా నయ్యెడన్
సహజక్రీడలు గావె యెల్లప్రజకుం జౌర్యక్రియావైఖరుల్.

చ. బుగబుగతావులం బొదలుపుప్పొడిచే మకరందధారచే
నొగిఁ దముఁ బ్రోచినంతవడియు న్గడునర్మిలిఁ జేరి కొల్చి మా

పగుటయుఁ దుమ్మెద ల్జలరుహంబులఁ దొల్లిటిప్రాపు దప్పినం
దగఁ దొగల న్వసించెను గృతఘ్నుల నెందును నమ్మవచ్చునే!

సీ. దైవతైర్థికులు మందాకినీతోయము
లొప్పరించిన గాజుఁగుప్పె లనఁగ
ఘనపథద్యుతి నవగ్రహరత్నములు దాఁప
నిర వైనదంతంపుబరణి లనఁగ
నలవిభూదయహేతు వగుతూర్పుఁజాలాలు
హువ్వైన నుమియు చిట్టుము లనంగ
వెలయు రాసులఁ బొల్చు వినువీథిఖలమునఁ
జెన్నొందు సెలగదోసి క్లనంగ
రేయిసురతాణి జగమావరింపఁ దలఁచి
పొలుచు నిరు లను బలురికీబులను బనిచి
కొటల నెత్తినసున్నంపుఁగుండ లనఁగఁ
జాలఁ గనుపట్టెఁ దారకాసముదయంబు. 28

మ. ఘనధారాధరభూమిక ల్గగనసాత్త్వోన్మార్తు లామ్రేడితాం
జనశైలంబు లనేకథావిహృతిమత్స్వర్భానులీలల్ వికః
ర్తనజాకృష్టవధాదిమార్గములు నక్తంవార్ధిశైవాలము
ల్పునరుక్తార్కసుతాచ్ఛట ల్దగెఁ దమంబు ల్తాండతండంబు లై.

క. దిక్కుల నిండి ధరిత్రిం
గ్రిక్కిఱిసి మహాతమంబు గిటికొనె నిఁకఁ దా
నొక్కింత దలఁకెఁ గాంతు
లక్కక విలసిల్లు చుక్కలం గప్పుతటిన్. 30

గీ. పొలిచె ధవళిమ జాబిల్లిపొడుపునందు
రమణ సమయపు వజ్రపురాజురాక
తగ నెఱింగింపఁ జీఁకటు ల్దామె దారి
కడకు వ్రాయంగఁ జెచ్చు కాకత మనంగ. 31

వ. అంత. 32

చ. కుముదములందుసామముఁజకోరములందునుదానమున్రథాం
గములయెడ న్విభేదనము గాటపుఁజీఁకటియందు దండన
క్రమమును గానిపింపఁగఁ దగం బగ లెల్లను నీఁగి విక్రమం
బమరఁగ రాజు గైకొనియె నయ్యుదయాచలసింహపీఠమున్.

ఉ. ఎల్లజను ల్పయోరుహభవేశ్వరవిష్ణుమయాత్ముఁ డైనవాఁ
డల్లవికర్తనుం డనుచు నాడుదు రాతఁడు గాఁడు నేన సూ
తెల్ల మటంచు లోకులకుఁ దెల్పినరీతిని జంద్రునందు రా
గిల్లెను మేనిపైఁ బొడుపుఁగెంపును బాండిమముంగళంకమున్.

సీ. ఖరకరుం డతిశీతకరలీలఁ దనయందు
వహియించె నీతనివంకఁ గాదె
మును దిస్సమొలసామియును రాజశేఖర
త్వము దాల్చె నీతనివంకఁ గాదె
యమరు లై వేర్వేఱ యదితినందను లున్న
వారు దా రీతనివంకఁ గాదె
నరులు సేవను జిదానందానుభవయోగి
వరు లౌదు రీతనివంకఁ గాదె

జలజభవువంక హరివంక శౌరివంకఁ
గొదవ లెన్నుచు మ్లేచ్ఛులు మొదలుగాను
వరుస నీక్షింతు రీతనివంకఁ గాదె
యనఁగ జాబిల్లి ప్రాఁకె నయ్యభ్రవీథి. 35

ఉ. పెంపునఁ జందమామ ప్రతిబింబముఖంబునఁ జుంబనంబు గా
వింపను డాయఁ దత్తరనవీనరుచు ల్వలితభ్రమంబు వు
ట్టింపఁగ రోసి పద్మిని ముడించెను మోమునఁ దమ్మి మోడ్చె నా
యింపటుసూచి నవ్వెనన నెంతయును న్వికసించెఁ గల్వయున్.

గీ. భూనభోవీథిఁ బాలారఁబోసినట్లు
కడలిదొరపట్టి వెన్నెల గాయసాగెఁ
బులికిఁ బుట్టినకూనకుఁ బొసఁగ నొక్క
చాఱయును లేదె దీని కాశ్చర్య మేల? 37

వ. [1]ఇవ్విధంబునఁ జంద్రికాపూరంబులు తోరంబులై బిసప్రసవకోరకవిసరంబులం బొదల దళంబుల సందుసందులం దెఱపి గని చొరంబాఱి మధురసమిళితపరాగయోగంబు పొంగార గాఱ యిచ్చినచందంబున నందంద తార్కొను కోకనదగేహినీగేహంబులకు నోడుబిల్లలఁ గప్పినయొప్పును గల్పించుచు నటమున్న హిమకరతరుణకిరణఘనఘనికనికర క్రియానటీరంగంబులగు సురంగంబులును దరవికచోత్పలనిర్ముక్తప్రభామండలయంత్రోపలంబులను దళంబు లను కొత్తళంబులు విరియించి

1. ఈవచన మసంపూర్తిగా నస్పష్టముగా నుండుటచే నున్నంతవఱకున్నట్లే యుంచితిమి.

మకరందవాహినీనిర్ఝరంబులకుం దగుతత్తటంబు లను వంకదారులం జొచ్చియు నగ్గలికలం గలకుముంగడినంగడిం జడిసి యెడనెడం దోరంగు లగు మధుకరఝంకారంబు * * * రావంబు తననందనునికువలయప్రతిపాలనఖేలనావిశేషంబు గనుంగొని హర్షోత్కర్షంబునం బొంగి నింగి ముట్టంబోలుం గాకున్న మకరకర్కటమీనంబులకిందునుండం బని యేమి యని వెఱంగున సురగరుడసిద్ధవిద్యాధరముగ్ధధవళేక్షణాసముదయంబు వీక్షింప జారసారసముఖీజాలంబులకుం బ్రతికూలంబును మలిమ్లుచప్రచారంబులకు దూరంబును విరహిణీజననివహంబునకు దుర్వహంబును జంద్రకాంతశిలావిటంకంబులకుం బొంకంబును నై జగదండఖండంబున నిండి మెండుకొనియె, నయ్యవసరంబున. 38

గీ. అంత కటమున్న సమయకృత్యములు దీర్చి
యవనిసురుఁ డుండెఁ బర్ణశాలాంతరమున
దేవదేవియుఁ దాఁ దదాదేశమునను
గడఁక మునిమాపె తనపాదకడకు వచ్చి. 39

సీ. మెదిచి మెత్తినమృగీమదపంక మాయెను
మడవలు గట్టఁ బైఁబడినరొంపి
తావి గుబాళింపఁ దగుగందవొడి యయ్యెఁ
బాదులుద్రవ్వఁ బైఁబడినదుమ్ము
నిండారు కుల్కుపన్నీటితుంపురు లయ్యె
బడలిక చేఁ గానఁబడినచెమట

కంతుకేళిని గచాకచిఁ బెనఁగుట యయ్యె
వడిఁ బాదల్ చోరఁ జిక్కునడినకురులు
అనుచుఁ దనయింట సకలభాగ్యములు గలిగి
తొలుతఁ దానున్నయునికియుఁ దలఁచి యప్పు
డచటఁ దానున్న యునికియు నరసి యరసి
దిగులు మదిఁ దోఁప మఱియుఁ జింతింపఁ దొడఁగె. 40

—* దేవదేవి విప్రనారాయణుని వంచింపలేక వగచుట *—

ఉ. అక్కట! నాఁడు మాయపువనానిల మేటికి వచ్చె వచ్చెఁబో
యిక్కడికంచు వెంబడిన యే నరుదేఁ బని యేమి గల్గెఁబో
యిక్కతినాత్మఁ డయ్యెడల నేల వసించె వసించెఁబో యితం
డెక్కడఁ బోయె నే మనక యీగతిఁ బన్నిద మేల వైచితిన్!

క. నటనల విలాస రేఖా
ఘటనల నీజటిఁ గరంపఁగల నని మున్నే
నటు సూచితి నటుగా దని
యిటు సూచితిఁ దెమలఁ డింక నే మనుదానన్. 42

క. నేరము చేసితి నెంతయు
నీరేరుహనాభ! కృష్ణ! నీతిరువుళ్లం
బేరీతి నానతీవే
శ్రీరంగా! రంగరంగ! సేవకఫలదా! 43

—* దేవదేవికి రంగనాథుఁడు స్వప్నంబునఁ గనఁబడుట *—

వ. అనుచుఁ జింతాపారవశ్యంబునఁ గొంత నిద్రించుసమయం
బునఁ నార్తజనశరణ్యుండును నిఖిలదేవతావరేణ్యుండును భక్త

జనఫలప్రదాయకుండు నగురంగనాయకుం డయ్యెంతి భావం
బున నావిర్భావంబు నొంది, యిందువదనా! భవదీయమనో
రథంబు సఫలం బయ్యెడు మెల్లి యీప్రొద్దు దనుకం దాళుకొ
మ్మని యనుగ్రహించి యప్పంచశరగురుండు తిరోహితుం
డైనం గనుంగొని మేల్కాంచి చంచత్కుతూహలాన్వితభయ
సంభ్రమంబులు మనంబునం బెనంగొన నాత్మగతంబున. 44

క. ఈకల నిజమో కాక ప
రాకో చోద్యమగు......లు గలవే
నాకల యెన్నఁడు నిక్కల
గాకుండఁగ నిటు పరాకు గాఁ బనిగలదే. 45

క. అని యెపుడు తెల్లవాఱును
దినకరుఁ డీఁక నెప్పు డపరదిక్కున కరుగుఁ
వనరుహనాభునివాక్యం
బనుకూలం బెప్పు డగునో యని యున్నంతన్. 46

—* సూర్యోదయాదివర్ణనము *—

క. రక్కసులగురువు గురుపకు
వెక్కస మగుమతికినిరవు వెరవుల కెల్లన్
దిక్కు నుతికెక్కువేగురుఁ
జుక్క(ంత)టవిటులు గడుఁ నుచుక్కనఁ బొడిచెన్. 47

చ. ఇననిభుఁ డైనగౌతమమునీంద్రువివేకము వీటిఁబుచ్చి యా
యనఘునిధర్మపత్నికి నహల్యకు నాఱడి దేఁ దలంచి వం

చనగతిఁ గూయు కోడిగపుజాతి జగద్విపరీతచర్య మిం
చనుజరణాయుధంబులగుసాములు దారెఱఁగించి రెంతయున్.

మ. పలుకం బాఱె నగారచారుతరదీపజ్వాలిక ల్దిక్తటం
బులఁ గన్పట్టె విటీభుజంగనయనంబుల్ నిద్రఁ జెందెన్ విఘూ
పలజాలంబులజా లడంగె శశిబింబస్ఫూర్తి తగ్గె న్నవో
త్పలకాంతు ల్రహిఁ దీసె దాఁగె నిరులంతన్ గహ్వరాంతంబులన్.

శా. స్మర్తల్ తత్త్వ మటంచు నెంచఁగ మహాశైవు ల్మనోజద్విష
న్మూర్తింగా నుతియింప వైష్ణవులు విష్ణుం డంచు నెంచం దగం
గర్తారుం డనుచుం దురుష్కులు మొదల్గాఁ గొల్వఁ బ్రత్యక్షమై
మార్తాండుం డుదయించె నబ్ధితటసీమప్రాంచితౌర్వాకృతిన్.

క. అప్పుడు మేల్కొని చెలి ముద
మొప్ప న్సుఖమజ్జనాదు లొగిఁ దీర్చుచుఁ దా
నెప్పటివలె ముని చెప్పిన
చొప్పున నెలఁదోఁట చేయ సూర్యుఁడు గ్రుంకెన్. 51

మ. కలికాలాకృతనీప ముజ్ఝితసరఃకాదంబ ముత్క్రోచకం
దల ముద్విగ్నశకుంత ముల్లుఠదుదన్వల్లోల(కల్లోల)ము
త్తలికాయుక్తమయూర మున్ముఖసముద్యచ్చాతకంబు న్సము
జ్జ్వలజంతువ్రజ మంబుదాగమము విశ్వస్తుత్య మయ్యెం దగన్.

చ. మొనసె ఘనాఘనంబులు తమోనికరంబులు మచ్చరించి పే
ర్చిన మఱి యొక్కవేళ నొకచెల్వున నొక్కవిలాసరేఖఁ జ
య్యన నుదితంబులై .........ఘనంబులై
మునుకొని కారుక్రమ్ముకొని ముంచెనజాండకరండమండలిన్.

క. పలపలపల యని చినికెం
ఔళపెళపెళ యనుచు నుఱిమె బెళుకు మెఱుంగుల్
తళతళతళ యని మెఱసెన్
బళిబళిబళి యనుచు హాలికపటలి నటించెన్. 54

క. చిటపొటచినుకులు మిగులన్
బొటబొటబొట యనుచుఁ బడఁగఁ బొదరిల్లు గడుం
జొటజొట నుఱియఁగ గురుకుచ
కటకటకట యనుచు వగపు గడలుకొనంగన్.

సీ. పనిలేనిపని పట్టి పాలార్చి పన్నిదం
బనినతొల్లిటినేరమునకుఁ దోడు
కుడిచి కూర్చుండి యేఁ గ్రొవ్వి యివ్వేషంబుఁ
బూనినయవివేకమునకుఁ దోడు
గుఱు తెంచ నొగాము లెఱుఁగక చెన్నాఱఁ
గొనినట్టి మూఢత్వమునకుఁ దోడు
తలఁచిన తలఁపు బొములు దెచ్చినట్టి యీ
తనువు వయోగర్వమునకుఁ దోడు
గొంటుబాఁపఁడు తా రాతికొడుకుఁ బోలె
నటనలకు లోనుగాకయుండుటకుఁ దోడు
నన్ను నదవద వణఁకించి నలఁపవలసి
వర్ష మిదె యీఁదయును దాను వచ్చె ననుచు. 56

క. తడయక మిక్కిలి వానం
దడియక వసియింపఁ దగును దాపసిపంచం

గడకుంజ మెంత యుటజము
కడకుం జనవలయు ననుచుఁ గదలి కడంకన్. 57

సీ. అడు గిడు నడుగు గొంకిడుఁ గొంకి తడవును
దడవి యొయ్యనదాఁటు దాఁటి నిలుచు
నిలిచి యొంటిఁ దలంకుఁ దలఁకి దైవముదూఱు
దూఱి పొదల్దూఱుఁ దూఱి యలయు
నలసి నివ్వెఱఁ గందు నంది యుస్సురు మను
నని కెలంకులచప్పు డరయు నరసి
చనఁ గొంచుఁ గొంచి యమ్మునిపొలంకువ విను
విని కొంతధృతివహించును వహించి
కటికిచీఁకటిగములకుఁ గలఁగుఁ గలఁగి
మెఱుఁగుమొత్తమ్ము లడరిన మెచ్చు మెచ్చి
చినుకుపడిన గగుర్పాటుఁ జెందుఁ జెంది
యలసగతితోడ మెలపున నరుగు నరిగి. 58

క. ఆవనజేక్షణ గాంచెం
బావన మగుపర్ణశాలపజ్జను ఘనసా
రావి న్నిజదళచలనవి
రావిఁ శాఖాపరంపరావిఁ రావిన్. 59

వ. ఇత్తెఱంగునం గురంగనయనారత్నం బతియత్నంబునం గనుం
గొని యంతంతఁ దనయునికిఁ గొంతయనుకూలం బగుతదీయ
మూలంబున నిలిచి విసిలిమధామం బగుఘూమంబునడుమం

గడు మెఱయు పావకజ్వాలచందంబునఁ జంచరీకమాలికాభి
రామం బగుకుఱంగటి ధామంబున మషీమలినపటఖండం
బునం బొదిగిన మాణిక్యశలాకవిలాసంబున వలి కరువలి
విసవిస విసరం గసర మసర (సర)సం గల కటికిచీఁకటి మొ
త్తంబుమధ్యంబున నిగనిగనిగని నెమ్మేనుదీఁగె రాగిల్ల నల్లన
వసియించె నయ్యవసరంబున. 60

క. మూఁగినఘనములు తారం
గ్రాఁగినధరణీతలంబు కడసెక లెల్లక్
లోఁగినఁ గుంభద్రోణము
గాఁ గురిసెం బాము ప్రేలఁగట్టినశేవన్. 61

చ. పడువడగండ్లపెల్లు గనుపట్టు మిణుఁగుఱుఁబుర్వు లంచు సం
దడిగొను నింద్రగోపములు దర్దురఘోరరవంబు తోడుతం
దడఁబడు నార్తజంతవనినాదము మోదము మీఱ నెల్లెడం
గడుఁ జరియించురాజిలనికాయములుందఱచయ్యెనయ్యెడన్.

క. దిగువం బాఱెడు వెల్లువ
కగపడి పైజాఱు మ్రానియాఁకులనీటం
బొఁగులుచును జల్లువాన
న్నొగులుచు నయ్యింతి యిట్లను న్మదిలోనన్. 63

శా. చెప్పం జిత్రముగాఁ జలంబు గొని వచ్చె న్నాలిపెన్వాన యే
నెప్పాటం దరియింతు దీని మఱి యింకెవ్వారు దిక్కేగతిం
దప్పం ద్రొబ్బఁగ వచ్చు నీ వకట నిన్న న్నాకలం గన్న రం
గప్పా! యెక్కడ నున్నవాఁడవు పరాకా నన్ను వేక్షింతువా!

చ. అనుచును బల్కరించు వసుధామరవల్లభుఁ బిల్వఁ జూచు ని
మ్మును లతికోపను ల్పరమమూర్ఖులు తాళుకొనంగనేర రే
మని శపియింతురోయని భయంపడుఁబోయినప్రొద్దుపోయినం
జినుకునకోర్చి యిందునెవసించుటమేలనుఁ బెక్కుభంగులన్.

క. ఇవ్విధమున నపు డయ్యెల
జవ్వని తలపోయుచున్నసమయంబునఁ దా
నవ్వలని పర్ణశాలం
బువ్విలుతునితండ్రిఁ బోలుమునినాథుండున్. 66

సీ. కావేరిపూర మెక్కడ వెల్లివిరిసెనో
యొద్దికాలువ యెద్ది యుర్లఁబడెనో
అసదైనమ్రాఁకు లెయ్యవి పెల్లగిల్లెనో
యాకు లేవంకఁ జీకాకుపడెనో
కలిగొట్టుచిన్న రెందులఁ... బెట్టెనో
సుడిసి యేకొమ్మలు బడలువడెనో
గాడ్పుచే నూటాడి కారె మే మయ్యెనో
లతికలచెలువ మేగతిని జనెనో
తెలియ నింతయు వర్షంబు వెలియ దామె
మొగులుమొత్తంబు లెప్పటిపగిదితోడఁ
గారుక్రమ్ముచు నున్నవో కాక కొంత
పలుకఁబాఱెనో కనుఁగొనవలయు ననుచు. 67

గీ. లేచి మెలపునఁ దాను గీలించియున్న
మెట్టు సడలించి వాకిటఁ బెట్టినట్టి

తడికఁ గేడించి పొదరునఁ దార్చి భూమి
సురశిఖామణి యటు తొంగిచూచునపుడు.

క. చలనం బందక చెంగటి
వలనం గనుపట్టు నింపువదనం జూచెం
[1]గలవాణీనిందితకో
కిల నంచితకలన రావి కెలనం గెలనన్. 69

—* విప్రనారాయణుఁడు దేవదేవింగాంచి పర్ణశాలకు రమ్మనుట *—

చ. కని దూరీకృతకంటక స్మితగతోగ్ర గ్రావరాజి న్నిర
స్తనికుంజావళిఁ బొల్చు నిచ్చలదళచ్ఛాయ న్సదాచారపా
వనవేదిం బవడంపుఁదీఁగె నడురే వర్తించుచుండం బనే
మని శంకింపఁ దళుక్కున న్మెఱసె నుద్యచ్చంచలాజాలముల్.

క. క్రొమ్మెఱుఁగుల ధగధగరుచి
చిమ్మనిచీఁకటుల విరియఁజేసిన నపుడా
కొమ్మం దెలియఁగఁ గనుఁగొని
క్రమ్ముదయం దేవదేవిగా నెఱిఁగి తగన్. 71

క. వానం దడియఁదొడంగిన
దానం దాననుచు నాకుఁ దగ నెఱిఁగింపం
బూనదు మది నానదు ధృతి
మానదు వర్షంబు గోల మగువ యటంచున్. 72

పంచచామరము. అదే మదేమి దేవదేవి! యాతరుచ్ఛదావళీ
భిదాసదాన మైన యట్టి పెంజడిం గడు న్వడం

1. గలనిందితవాణినిగో,—అని మాతృక.

కాదే మదీయదీప్యమానగేహ మూహాసేయ ను
న్నదేకదే మదేభయాన యుండ నుండరా దటే. 73

చ. అని మునినాథచంద్రుఁడు దయారస ముప్పతిలంగఁ బల్కిన
న్విని యలివేణి తా నిదియె వేళ యిఁక న్సతి వీడఁ దక్కఁగాఁ
బెనఁగకయున్న నన్ను వెడపేరునఁ బిల్తురు లోకు లంచు దం
డను దరుకోటరంబుకడ డాఁచిన సొమ్ములు నంబరాదులున్.

క. నెమ్మిని గైకొని యయ్యుట
జమ్మునకుం గీరవాణి చని తత్ప్రతీహా
రమ్ము కడ నిలువ, రా రా
రమ్మని యమ్మునివరుండు రమణిం బల్కెన్. 75

ఉ. అక్కడ నుండ నేల ధవళాయతలోచన వానకొట్టునం
జిక్కితిగా యిఁకం దడవు సేయకు నాచిగురాకుశయ్య యీ
దిక్కున నున్న దీ విటు మదీయపదంబులదండ నుంచు పెం
పెక్క ధరింపఁగావలయు నే నిదె నాదగుకావిశాటియున్.

సీ. తడికాళ్లతోఁ ద్రొక్కెదవు చుమీ యిదె కుశా
స్తరణ మాత్మధ్యాన సమయ మయ్యె
నెడతేదు వేష్టువ లిట రమ్ము ముట్టెదు
గనుక ప్రాతస్స్నానమునకు వలయుఁ
బీఠంబుపైఁ దీర్థపెరుమాళ్లు వేంచేసి
యున్నవా రపచార మోసరిల్లు
పెట్టినారము పట్టి బుట్టిలోఁ [1]దులసిని
జతనంబు భానువాసరము జేపు

1. దిరుతులసీజదళంబు—అని మాతృక.

పల్ల మాపూల వలిపిరి చల్లు నిచట
నటియు నీచాయ నిద్రమైనుందు నచట
మహితరామానుజోదీర్యమాణభాష్య
ముఖబహుగ్రంథసామీప్యమునకుఁ జనకు. 77

క. కన్నియ ! కమండలూదక
మున్నది నీ వటుఁ దొలంగ కుండఁగ దండం
దిన్నఁదనంబున నుండు మ
టన్నను మన్ననకు నలరి యబలామణియున్. 78

ఉ. అప్పుడు జిల్గు దువ్వలు వొయారముగా సవరించి క్రొవ్విరుల్
గొప్పన నొప్పుగాఁ దుఱిమి కుంకుమ గంధము మైనలంది ఢా
గుప్పతిలన్ విభూషణసముత్కరముల్ ధరియించి హారముల్
గొప్పచనుంగవందు నెఱికొల్పి తనర్చి విలాసవైఖరిన్. 79

ఉ. నూతనరత్నభూషణమనోహరకాంతులు దీపదీప్తివి
ఖ్యాతి వహింపఁ గ్రొమ్మెఱుఁగు కైవడి మై నిగుడంగ దేవదే
వీతరళాక్షి యప్పుడమివేలుపుచెంతకుఁ దారసిల్లి హే
లాతిశయంబునం బలికె నంకురితప్రమదానురాగయై. 80

ఉ. గోపవధూసనాథ(పదకో)కనదద్వయభక్తియుక్త ! యో
తాపసవర్య ! యీచలికతంబున నిద్దుర రాదు విష్ణుగా
థాపదలీలలం గడపెదం దగుప్రొద్దని విన్నవించి యా
లాపము సేసి కోకిలకలధ్వని మొత్తయు వింతసేయఁగన్.

మ. తలిరుంబోఁడి దొడంగి మాధవుఁడు రాధం గూడి క్రీడించుగా
థలు కుబ్జం గయికొన్నవార్తలును సత్యావాంఛ లీడేర్చుసు

ద్దులు నాభీరవఘాటులందుఁ గల సౌందర్య రుక్మిణీదేవిపై
చెలిమిఁ గ్రొన్ననయిచ్చులాగు వినిపించెఁ మాఘకవివైఖరిన్.

వ. ఇవ్విధంబున శృంగారరసప్రధానంబు లగుకథాప్రసంగంబు
లం గొంత యభిముఖుం జేసి కలఁక యగుధైర్యంబున నున్న
యతనిం జేరంజని. 83

చ. పడఁతుక తేనెలుట్టిపడఁ బల్కెను మానికులావతంస! యిం
పడరఁగ మార్దవంబునెల వయ్యొకసీచరణంబు లొత్తెదన్
బడలినవార లిందనుకఁ బాదులు ద్రవ్వియుఁ గారె మెత్తియున్
మడవలుదీర్చియుంబదపమార్చియుఁ గాలువలేర్పరించియున్.

గీ. అనుచుఁ గెంగేలుఁజిగురుల నతనిచరణ
కమలయుగళి నిజాంకపీఠమున నునిచి
యంగుళీయకఖచితంబు లైనమణుల
డాలు నఖరుచితోఁ బల్లటీలుగొనఁగ. 85

క. ఒత్తెం జరణము లటు దళు
కొత్తెం దమి మునికి లాక లొత్తెం బులకల్
చిత్తజుఁడు వింటఁ దూపున్
జత్తాయతపఱచి చిత్తజల్లుగ నేసెన్. 86

సీ. అప్పుడు చిట్టుముట్టాడుకోరికలను
దమకంబుచే నైన తత్తఱములఁ
జేతెత్తి నిలుకడఁ బెడఁబాయుసిగ్గుల
నొక్కింత నుజ్జాఁత లూఁగఁ దారి

యుసటుఁ జన్నులకునై యుఱుకు నగ్గలికల
మన సొగ్గనీయని మహాగ్ర్యములను
అధరమాధురికి నత్రాడు ముచ్చటలను
గొదలేక ముప్పిరి గొన్నమమతఁ
దపసి డెందంబు వెన్నచందమునఁ గరఁగఁ
గలయికలమీఁదితిమురునఁ దొలఁగుచుండఁ
జిత్తజునిసేన తెలగోలు సేసినట్లు
కులుకుఁబలుకులఁ జిలుకలకొలికి పలికె. 87

క. లాలనసేయవు నన్నుం
గేళీసంగతుల బుజ్జగింపవు నీపై
హాళిం జిక్కితిఁ గన్నడ
యేల దయం జూడ లేఁతినే మునినాథా! 88

మ. అనుచుం గంకణనిస్వనంబులు బెడంగై మ్రోయఁ గాంచీకల
స్వనముల్ వీనులవిందుసేయనుదుటుంజన్నుల్ గయాళింప లో
చనదీప్తుల్ చెలఁగంగఁ బైకొనుసరోజాతాస్యతోడం గడం
కను గ్రీడింపఁదొడంగె నత్తపసి రంగస్వామి ప్రేరేపఁగన్. 89

సీ. చక్కెరకెమ్మోవి చవిచూచి చవిచూడ
నొయ్యనఁ గొనగోర నొత్తి యొత్తి
కివకివఁ బారువా క్రియఁ బల్కి పల్కంగ
నలకళాదేశంబు లంటి యంటి
చుంబనక్రియలను జొక్కించి చొక్కింపఁ
గడునొయారముగాఁగఁ గవిసి కవిసి

బిగియారుకౌఁగిట సొగియించి సొగియింపఁ
జిట్టంటుచేతలఁ జెనకి చెనకి
యుచితబాధానుబంధత నుండి యుండ
ననఁగి పుంభావరీతుల ననఁగి పెనఁగఁ
దపసికిని నేర్పి యతనిమాగ్ధ్యంబు నెల్ల
రమణి [1]విడనార్చె [2]నతనుప్రౌఢిమ చెలంగ. 90

చ. అవితథయోగధుర్యుఁ డగునమ్మునికిన్ మఱపించె నెంతయున్
ధవళవిలోచనాధరసుధారసధార నిజోపరిస్థలిం
దవకరమాధురీధరసుధారసధారఁ దలోదరీమణీ
నవమణితప్రసంగకలనాద మనాహతనాదముం దగన్. 91

చ. మెలఁతయుఁ దాను సంయమి తమిన్ విహరించెఁ గవేరకన్యకా
పులినతలంబునందు సురపొన్నలనీడల మాధవీలతా
వలయములన్ మరందరసవాహినులన్ మదకీరశారికా
కులకలనాదసంకులనికుంజములం గమలాకరంబులన్. 92

వ. ఇవ్విధంబునం గతిపయదినంబు లిచ్ఛావిహారంబులం గ్రీడించి
యొక్కనాఁ డయ్యంగనాలలామంబు నిజమనోరథానుసరణప
రాయణుం డగునవ్విప్రనారాయణుం దోడ్కొని యగ్రజసమీ
పంబునకుం బోవం దలంచి యయ్యారామంబు నిర్గమించె
నయ్యవసరంబున— 93

ఉ. రంజితశింజితాభరణరమ్యనటీనట... ... ...
రంజయపుంజనావనిధరప్రభుతత్పరతాశుకీమణీ

1. విడనాడె- అని మాతృక.
2. అతనిప్రౌఢిమ- అని మాతృక.

పంజరకుంజరాశ్వభటబంధురదర్పితశత్రుభూమిభృ
ద్భంజనకంజనాయకసుతస్ఫుటనీతికళావిశారదా ! 94

క. ... ... ...సం
చారితఝుంపానృపాలచంక్రమమురళీ
ధారితకరేచితప్లుత
ధారాధౌరేయజవనతరగంధర్వా ! 95

కవిరాజవిరాజితము.
పురహరసూనుసమానసమిజ్జయ ! పుష్పసుగంధసుగంధిలధీ
కరటిఘటాశ్రవణాంచలబంధురగంధమహోపచితార్చిరతి
స్ఫురదనలప్రతిమాద్భుతతేజ ! యశోరుచిజాలసచోళబహిః
పరిపిహితాబ్జభవాండకరండకృపాశరధీ ...ధీశరధీ. 96

గద్య. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వర చరణసరోరుహాధ్యా
నానందకందళితసౌందర్యధుర్య ప్రబంధపరమేశ్వరవంశపవిత్ర
లింగనమసిపి.పుత్ర శ్రీకాళహస్తీశ్వరదయాసహాయ చదలవా
డ మల్లననామధేయప్రణీతంబైనవిప్రనారాయణచరిత్రం
బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# విప్రనారాయణచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీవిలసితగోవిందమ
దేవీహృదయేశ వంశదీపక పదరా
జీవ[1]నమద్వైరిధరి
శ్రీవల్లభ మాకరాజు తిమ్మనృపాలా ! 1

గీ. అవధరింపుము నిజపురీయాత్ర సేయు
నావధూటిని విప్రనారాయణుండు
తమకమునఁ జూచి మమత చిత్తమునఁ బెనఁగ
నపుడు తానును వెనువెంట నరుగఁదలఁచి. 2

సీ. శ్రీవిభుఁ డవధరించిన [2]గండనడములు
తిరుమణిపెట్టియ [3]విరులగరిడె
కౌపీనముల నోలిగట్టినదండంబు
గావివేష్టువ యిఱ్ఱికళవసంబు
సురుచిరం(బగు)నూర్ధ్వచూర్ణకరండంబు
జలకమండలువును దులసిపేరు

---

1. సమత్సరిపఁథిధరిత్రీ- అని మాతృక. 2. గండవిడియలు- మాతృక.
3. పూలఁగరడి- మాతృక.

నష్టఖేదాపహం బైనధవిత్రంబు
పుస్తకంబులు కుశప్రోతబృసియు
మఱియు దోంకెన గొడ్డలి మచ్చుకత్తి
సలగపాఱయు మొదలుగాఁ గలిగినట్టి
సాధనంబులి వెక్కడిసడి యటంచుఁ
బలుతెఱంగుల నల్లటు పాఱవైచి. 3

మ. నలినాక్షీమణి వెంబడిన్ సురటియున్ బంగారుభృంగారువున్
జిలుగుం బావడయున్ విభూషణములుం జీనాంబరంబుల్ సరం
బులు కర్పూరకరండముల్ పరిమళంబుల్ గందపుంగప్పుపా
వలునుంగా వటునించుకొంచుఁ జనియెన్ వాచంయమస్వామియున్.

క. ఈపగిది నతఁడు గునగునఁ
గోపనవెనువెంట నరిగెఁ గొంకక "కామాం
ధోఽపి న పశ్యతి" యనియెడి
యాపలుకులు పలుక నిశ్చితార్థము గాదే? 5

గీ. వారిరుహనేత్రి తనయాడువారిలోనఁ
బంత మీఁడేఱె ననుచును సంతసించి
త్రోవ నమ్మౌని నెటువలెఁ దోడుకవచ్చె
నటువలెనె తెచ్చి యక్కచెంగటను నునిచె. 6

క. ఇట్టెఁగద నీచూచిన
యట్టిమహాయోగి యీతఁ డౌఁగద మును నేఁ
బట్టినప్రతిజ్ఞ యిటు తుది
ముట్టెంగద చూడు మీముముక్షువరేణ్యున్. 7

ఉ. అప్పుడు దేవదేవిని దదగ్రజ గన్గొని మానివంకయుం
దప్పకచూచి నివ్వెఱఁగు నానయు సంభ్రమముఁ మనంబులో
నుప్పతిలంగ నోచెలియ! యోవికచోత్పలపత్రనేత్రి! నీ
కెప్పొలఁతుల్ దలంపఁ బ్రతి! యెవ్వరు నిన్ను నుతింపశక్యమే!

క. చక్కఁదనంబులు లేవో?
చొక్కపుసరసతలు లేవొ? సుదతులులేరో?
నిక్క మిటువంటి చిత్రము
లెక్కడనుం జూచి యెఱుఁగ నేఁ దరలాక్షీ. 9

క. ఓకన్నె! యింతజాణవు
గాకున్నను రాజులెల్ల గౌరవమొప్పఁ
నీకుం గైవస మగుదురో
యేకడ నీరానియీవు లిత్తురొ? చెపుమా. 10

సీ. నెఱవాది నని వచ్చి నీకుఱంగట నిల్చి
యేచెలి వీణవాయింప నేర్చు?
భరతశాస్త్రక్రియాప్రౌఢిచే నేకాంత
నీకడఁ జక్కఁగా నిలువనేర్చు?
నంగజాగమరహస్యము లెఱుంగుదు నని
యెవ్వతె యెదుట వాక్రువ్వ నేర్చు?
లావణ్యరేఖావిలాససంపద మేటి
నని యేవధూటి నిన్నెనయనేర్చు?
నఖిలగుణగణసంపన్న వైననీదు
తెఱఁగు సకలంబు నెఱిఁగియు నెఱుఁగలేక

ముదిత! నీతోడ నేను బన్నిదము చఱచి
యోడితిని నీకు నిఁక మాటలున్న వేల? 11

గీ. అనుచుఁ గౌఁగిటఁ గదియించి యగ్రజాత
చెలియలిని బిట్టు మూఁడుమెచ్చులును మెచ్చె
దేవదేవియు వివిధసంభావనముల
వారభామిను లెంతయు గారవింప. 12

క, నయగారపుఁదమిఁ గపట
ప్రియముల మెఱమెచ్చుఁబల్లరింతల మిథ్యా
చయములను బైపచారపు
నయముల మునిఁగూడి కొన్నినాళ్లు రమింపన్. 13

క. భూదేవుఁడు దా నేమిట
బూఁదారిన యొక్కకాసుఁ బొరయించుటయుక్
లే దఁట సకలము నడపిన
యాదౌరగతి సంచరించునఁట యిది తగవే? 14

గీ. అనివిచారంబు తనకు నింతైన లేక
సుగుడితన మనుమా టెల్ల సున్నసేసి
యన్నిటికిఁ దానె చనవరి యగుచుఁ దిరుగ
నావిధము చెల్లఁ గడుదేవదేవి రోసి. 15

సీ. కన్నులల్లార్చి రోక్కారోక్కములు మాళ్ల
వరుసగా గడియించువారిఁ జూచి
కట్టడ కిసుమంత కడమైన వేళ్ళొక్క
వైపులఁ జనఁ జూచువారిఁ జూచి

తరితీపు పుట్టించి తక్కి చేకాసెల్ల
వడివెట్టి రాఁ దీయువారిఁ జూచి
మొగమోట యుడిగి సొమ్ములమీఁదఁ గళవారి
వదలక యార్జించువారిఁ జూచి
విటుల మఱియును వంచించు విధముఁ జూచి
యమ్మునీంద్రుండు కష్టఁ బేద యగుటఁ జూచి
తల్లి వేసారికొనెడుచందంబుఁ జూచి
సఖులు ముష్టఁగుల్లఁబోయెడుసరణిఁ జూచి 16

క. ఈయునికి వారకాంతకు
నాయమె యిది యేడతోడుసు నాఁటికి నాయం
బాయె నిఁకం గలకాలము
పాయక యత్తపసిఁగొడవఁ బడఁగాఁ గలదే. 17

క. అపకీర్తి గాక యుండఁగ
నెపుడును నే మెలఁగుకరణి నే మెలఁగుచు నీ
తపసిని నిలువెడలింపఁగ
నుప మూహింపంగ లేదొకో! యనునంతన్. 18

—* వేశ్యమాత విప్రనారాయణుని వెడలఁగొట్టుట *—

సీ. గమకించుకీలుగుజ్జుముపదంబులరీతి
నున్నదంతంబు లుజ్జూఁత లూఁగ
వక్షోజములు జాఱి వ్రాలిపో మీఁగాళ్ల
కడదాఁక దూఱుమంకంబు లాడఁ

బలుకరించినను జెంతలఁ జేర రాకుండ
వాతుంపురులు చిత్తవాన గురియ
గుజ్జుంగు జ్జని కొళ్లుకొళ్లున దగ్గుచోఁ
దవిలిన చెవులు చిందర్లువోవ
బుజముపై నొక్కరోఁకలి పూనిపట్టి
గదరుకొనుచును గసరుచుఁ బెదవు లదరఁ
గొదవ లెన్నుచుఁ దాఁ గన్నకూఁతు రున్న
తావునకు వచ్చె నలదేవదేవితల్లి. 19

క. ఇటువలెఁ జేరం జని య
వ్విటకంటకి కూఁతు నదర వేయుచుఁ బట్టీ!
యిటువంటి వెఱ్ఱిదానవు
కటకట! తగవగునె వీనికడ వసియింపన్? 20

మ. కొలఁదుల్ మీఱినసంపదల్ గలభుజంగుల్ వీటలేరో! వదా
న్యులుగారో! వలవంతలం గలఁగి నిన్నుం గోరి రారో! నవో
త్పలపత్త్రేక్షణ! వీనిమాయలకు బాదా గాక నీయీడు భా
మలలో వన్నెయు వాసియుం గలిగియమ్మా! సొమ్ము పార్జింపవే.

చ. ప్రతి మఱిలేని లేఁగొమరెప్రాయపునాఁడె విలాసవైఖరిన్
మితిగడవం బదార్థము దమింగడియించుట నీతిగాక యీ
తతి చని పిమ్మటన్ ముదిమి దారసమైన మఱేటిసుద్దులే
గతజలసేతుబంధములు గావె ధనార్జనపుం బ్రసంగముల్?

చ. నెటికలు దీసి యిచ్చకము నేర్చి ప్రసంగము దీసి యప్పట
ప్పటికి నుతించి మాటలను బందిరివెట్టి నటల్ ఘటించి ము

చ్చుట లెటేఁగించి బాస సహజంబుగ నందఱు కన్నిరూపులై
విటులఁ గలంచి తీయఁదగు విత్తము లుత్తమవారకాంతకున్.

వ. అని యవ్విటకంటకి యివ్విధంబునం గూరిమిపట్టిం గిట్టి దినం
తులు గొట్టి కట్టెదుటం గంబంబుమఱుంగునం గదలమెదల
వెఱచియున్న యమ్మహానుభావుం జేవెలుంగునం గనుంగొని
నెన్నడుమునం జీర జాఱం జుట్టుకొని కొకిబికిమొకంబునం
జికిబికివెండ్రుకలు జుంజుఱుఁగొప్పునం జెదరి యుప్పరం బెగయ
రోఁజుచు నడుగులు దడంబడం బడంబోవుచుం గదలి యద
లించి విదలించి వైచుచుం జేరం జని— 24

ఉ. ఓరి యుటంకి! యీావికసితోత్పలగంధిని మారునింటిసిం
గారపుఁబూజవారువముఁ గారుమెఱుంగులలోని తేట నా
కూరిమిపట్టి నిట్టినసగూఁటితనంబున బేలువెట్టి తొ
రౌర! గణింప నన్ను వినవా? మఱి యుప్పరిలోనితక్కరిన్.

క. ఇలుసొచ్చి వెడల నేరవు
మలయుచు నేనాఁటిచుట్టమవురా యోరీ
ములుచ! యిటు నాగృహంబునఁ
గలిగిన సొమ్మెల్ల గుల్లగట్టి తినంగన్? 26

ఉ. ఎన్నఁడుఁ గాసు వీస మొక టిచ్చినవాఁడవుగావు వీట నీ
వన్నియకోడెకాండ్రు తగవారవధూటులకై యొసంగునా
చిన్నెలు నీవు చూచియు నిసీ! తలవంపఁగ నేర వన్నిటం
బిన్నతనంబు దాల్చితివి పెద్దగ నిన్నిఁక నాడ నేటికిన్? 27

సీ. కడుఁబట్టతలల మోఁకాళ్లను ముడివెట్ట
నేనేర్తు మఱియును నేనె నేర్తుఁ
గోటికిఁ బడగెత్తి టాటాలుగుణియింప
నేనేర్తు మఱియును నేనె నేర్తుఁ
గొలిచి మింటికి నేలకును సూత్రపట్టంగ
నేనేర్తు మఱియును నేనె నేర్తుఁ
బుడమిలో వట్టి యా బూమెలుసేయంగ
నేనేర్తు మఱియును నేనె నేర్తుఁ
దవిలి యిలువిద్య తక్కలిదంబు నాది
కపట మే నిచ్చువారికిఁ గాని దొరక
దహాహా! ననుఁ గన్నుఁబ్రామినయట్టి గడుస!
యుండుదువుగాని యింక నోరోరి! యనుచు 29

క. మెడఁబట్టి వెడలద్రొబ్బినఁ
గడు నతఁ డీడిగిలఁబడఁగ గ్రమ్మఱఁ దపసిం
బుడిసిటిపట్టుగఁ బట్టుచు
వడి నొక జరఠయును దాను వాకిట వైచెన్. 30

గీ. వైచి సరగునఁ గ్రమ్మఱ వచ్చి తలుపు
మూసి గడెవెట్టి యిఁక మునిముచ్చుకాన!
యిటు మొగంబైన నాకొద్ది యెఱిఁగె దనుచు
నింటికిని వచ్చె నవ్విటకంటకియును. 31

క. జనని గయాళితనంబును
మునిపతికిం గలుగుతమకమును గులధర్మం

బునఁ గినుక దనకు సమ్మతి
యనుగా నలదేవదేవి యూరక యుండెన్. 32

చ. అలధరణీసురేశ్వరుఁడు నవ్విటకంటకిచేతఁ బెక్కుభం
గుల నిటుమాటలం బడి దిగుల్ మదిఁ దోఁపఁగ దేవదేవిపైఁ
గలవలవంత యేమఱ కొకానొక చోటికిఁ బోనెఱుంగ క
మ్మెలఁతగృహంబుపంచఁదినెమీఁదనురంగపతిందలంచుచున్.

క. ఒకచోట నొదిఁగె నమ్ముని
మకరాంకశరానువిద్ధమానసుఁ డగుచుఁ
లుకలుకని యపుడు తపనుఁడు
చకచకరుచితోడ నపరజలధిం గ్రుంకెన్. 34

ఉ. అంతట రంగశాయి వివిధావసరాన్నము లారగించుచు
న్నంత నవీనగానకలనానటనశ్రవణావలోకనా
నంతరవేళ సేవకుల నందఱఁ బంచి మణీమనోజ్ఞశు
ద్ధాంతనికేతనంబున రహస్యవినోదవిహారహారి యై. 35

సీ. భుజగేంద్రుఁ డుపధానముగను నొయ్యన నొక్క
హస్తంబు తలక్రింద నంద మొందఁ
జక్కఁగాఁ గటిమీఁదఁ జాఁచినడాకేలు
పద్మానుబంధసంపదలు దెలుప
జలదంబుపైఁ గ్రొత్తతళుకిచ్చు సాంధ్యరా
గముతేవఁ బీతాంబరము చెలంగఁ
జాయకుంకుమదట్టిఁ జక్కఁజెక్కినవంకి
చెలువువిలాసంబు జిగి దొలంక

నిండు వేడుకఁ బాలమున్నీటిసుతయుఁ
బంటవలఁతియు నీళయుఁ భక్తితోడ
నడుగుఁదమ్ముల నొత్తఁగ నతులసౌఖ్య
లీల నారంగపతి పవ్వళించి యుండె. 36

క. పనిలేనిపని ముఖాంబుజ
మునకుం జెన్నగ్గలింప ముసిముసి నగినన్
వనరుహాగేహిని విభునిం
గనుఁగొని యిట్లనియె నర్మగర్భముగాఁగన్. 37

చ. మమతఁబితామహుల్ భువనమాన్యునిఁగన్న పురాణపూరుషో
త్తమ! నునుమించుఁజెక్కుల సుధారుచి పర్వఁగ నిర్నిమిత్త మీ
క్రమమున లేఁతనవ్వుఁజిలుకం బనియేమ్యది? యేవధూటిపైఁ
దమిఁగనువేసితో వలెఁగదా మఱి నీకిపు డాప్రసంగముల్. 38

క. రంగద్విలాసకుబ్జా
లింగనతోషితమదీయలీలాసేవా
సాంగత్యవచనరచనల
భంగుల నే మైనఁ గొదవపడెనో? యుపేంద్రా! 39

వ. అని చాతుర్యంబుగాఁ బలికిన రంగనాయకుం డప్పుణ్యాంగ
నాలలామంబు వదనం బాలోకించి. 40

క. ఓలలనామణి! నాపై
నీలాగున సంశయింప నేటికి నన్న
ల్లీలాదరహాసాగమ
మూలం బామూలచూడముగ నెఱిఁగింతున్. 41

ఉ. తోయరుహప్రభూతకులదుగ్ధపయోధివిధుండు విప్రనా
రాయణనామధేయుఁడు మహాత్మవిధేయుఁడు యోగమార్గధౌ
రేయుఁడు పొల్చు సద్గుణగరిష్ఠుఁడు మచ్చరణారవిందసే
వాయతబుద్ధియై యహరహంబును బువ్వులతోఁట సేయుచున్.

ఉ. ఆమహితాత్ముఁ డొక్కవెలయాలికి మిక్కిలిఁ దాను గూర్చువాఁ
డై మమతన్ మెలంగుచు నొకప్పుడు నేమియు నీయకున్న చో
గామిడి దానితల్లి విటకంటకి యిల్వెడలింప వంతచే
భామినియింటిచెంత బహుభంగులఁ జింతిలుచుండ నవ్వితిన్.

క. నావుడు నిందిర దేవా!
దేవరపదభక్తుఁ డిట్లు దీనతఁ బొందం
గా వెస నతనిం గావం
గావలదే యింత(దనుక) గడచెనె పనియున్. 44

సీ. పాఱుఁడ నని పట్టపగలు నట్టేటిలోఁ
బలువచేఁతలకుఁ బాల్పడినవాని
విదితంబుగ విచిత్రవీర్యుని రాణివా
సములకు నడి దెచ్చి చనినవానిఁ
బుణ్యతీర్థము లాడఁబోయి యులూచియు
నన్యకపత్యంబు గన్నవాని
మోహినిపై మోహమునఁ బెక్కుదివసముల్
దన్నుఁ దా నెఱుఁగక యున్నవాని
దయను రక్షించి భక్తవాత్సల్యమహిమ
దనర మీరిట దివ్యచిత్తంబునందు

నవధరింపఁగఁ దగదె ? మహానుభావ !
జీవితేశ్వర ! యిట్లుపేక్షింపఁదగునె ? 45

క. కేవలమూఢులఁ బొరసిన
కైవడిఁ జింతాభయాదికంబులు వొరయం
గావచ్చునె జగదీశ్వర !
తావకదాసానుదాసదాసుల కైనన్. 46

ఉ. ఏతతిసైన నిన్ను భజియించిననిత్యుల లోఁ దలంచినం
బాతకముల్ దరింపని ప్రపన్నులు నెవ్వగ లుజ్జగించి వి
ఖ్యాతులు గానిభక్తులు నిజాధిపతిత్వము దాము పూని నీ
చేతఁ దగం బనిం గొనని సేవకులుం గలరే జనార్దనా ! 47

ఉ. కావున నమ్మహీసురశిఖామణిదుర్దశ మాన్పి యింతటం
గావఁగదయ్య నామనవిఁ గైకొని నీవు దయాపరుండవై
నా విని రంగశాయి వదనంబున లేనగ వంకురింప న
ద్దేవిని జూచి యంబునిధిధీరగభీరతరస్వరంబునన్. 48

క. శతపత్రపత్రలోచన !
యతఁడు మహాయోగి మామకాద్భుతమాయా
గతి నట్లున్నాఁ డెఁతయు
నితరులవలె నతనిఁ బొరయునే మోహాదుల్ ? 49

సీ. నిక్కిమూడఁగఁ గల్గెనే యంబరీషుని
దూర్వాసుఁ డొనరించు దుర్నయములు ?
పైడాయఁ గలిగెనే ప్రహ్లాదుని హిరణ్య
కశిపుచే నగునవగడపుఁబనులు ?

ఘోరయఁ గల్గెనె పాండుపుత్రులసతి దుస్స
సేనుండు సభను జేసినకొఱంత ?
కారింపఁగల్గెనే గజరాజు నిర్వక్ర
నక్రభీకరవిక్రమక్రమంబు ?
వేయు వా రన నేటికి ? వినవె నాదు
భక్తకోటికి హరిహయబ్రహ్మలైన
ధిక్కరింపఁగ శక్తులో ? చక్ర నెదుట
నిలువ నైనను శక్తులో ? తలిరుఁబోఁడి ! 50

ఉ. ఆపద లొంద వచ్చునో? భయంబులు చేరఁగ వచ్చునో? మన
స్తాపము డాయవచ్చునో? విచారము చెంతల నుండవచ్చునో?
పాపము లాచరింప మతి పైకొన వచ్చునో ? మామకీనసే
వాపరతంత్రచిత్తు లగువారిని నీలవినీలకుంతలా ! 51

క. కలవే యిహపరసుఖముల్ ?
దలఁపఁగ మద్భక్తివిరహితము లగుయజ్ఞా
దులయందు నెందు నైనను
జలజానన ! నేల విడిచి సాదన గలదే ? 52

క. మన్న్యస్తాత్మకు లై తగు
నన్యస్తుతిరహితు లున్నతాఖిలలోకా
ధన్యుల్ శతశతమన్యుల్
ధన్యుల్ గతమన్యు లమరతాపసమాన్యుల్. 53

మ. హరిణీలోచన ! యట్లుగావున మదీయం బైన లీలార్థమై
ధరణీదేవకులావతంస మనురక్తస్వాంతుఁడుంబోలె నీ

కరణిఁ జర్తిలు నేతదాచరితము త్కైంకర్యపూజానను
స్మరణధ్యానఫలంబు లెన్నఁ దరమే చర్చింపఁగా నేరికిన్ ? 54

వ. అయినను దగువిధంబుల నీవునుం జెప్పెదవు గనుకఁ గరు
ణాంతరంగితావలోకనంబులం గటాక్షించి రక్షింపఁ దగు నని
యరవిందమందిరకుఁ దెలిపి పురోభాగనిక్షిప్తంబును విభీషణ
దత్తంబును నానారత్నఖచితంబును నుచితోపచారయోగ్యం
బును బర్యంతవ్యాప్తనైగనిగ్యంబును నగుకనకపాత్రంబు
గైకొని— 55

క. డం బలరఁగ నొకవటు వై
శంబరరిపుజనకుఁ డైనసఫలత సర్థి
త్వం బని బలి నడుగుట హృద
యంబునఁ గడు రోసి దాత యయ్యె ననంగన్. 56

—* రంగపతి దేవదేవికి బంగరుగిన్నె యిచ్చుట *—

ఉ. ఈయుపరంజిగిన్నె యిపుడే విటకంటకి కిచ్చి విప్రనా
రాయణు దేవదేవిని రయంబునఁ గూర్చి సుఖానుభూతులం
జేయఁ దలంచి యెంచి సరసీరుహనాభుఁడు నేకయామికా
త్యాయతభీకరార్భటి నిజావసథం బటు నిర్గమించుచున్. 57

క. చిటు కనక మాటుమడఁగిన
పుటభేదనవీథి నరసి పొలఁతుక తలవా
కిటికడ నోవిటకంటకి !
విటకంటకి ! తలుపు తీయవే యని పలుకున్. 58

క. ఆపలుకు తా వెడల్చిన
తాపసిపలు కనుచు లంజతల్లియుఁ గోపా
ద్దీపిత యై యిఁక నాచే
నీపరి పెట్లఁ బడ కరుగు నే పేఁ డనుచున్. 59

పంచచామరము. ఇసీ యిసీ! మొగంబుచూడకిల్లు వెల్వరించినన్
వెస న్విసంగి పోవు సిగ్గు పీసమంత లేదు నీ
దెసం బసల్ ఘటించె దేర! త్రిమ్మరీ! మ ఱెట్లు వ
చ్చి సారెసారె నన్నుఁ గెర్లఁజేయరాక పొమ్మికన్. 60

క. కాదేని చేతిరోఁకట
వాదుల వారించి లెస్స వడ్డించినచో
నీదిక్కున నీ కెవ్వరు
రా దిక్కని పల్క నవ్వి యతఁ డి ట్లనియెన్. 61

క. [1]ఓ ముదియ! నీవు గొట్టిన
నే మగు నెవ్వారికైన నీరోఁకటిచేఁ
దామును వడికెద మనఁదగు
సాములు మాయంతకులము చాలరె చెపుమా. 62

సీ. వింతవాఁడను గాను విటకంటకీ! విప్ర
నారాయణుం డంపినాఁడు నన్నుఁ
దాళుకొ మ్మొకకొంతతడవు నానామధే
యము [2]రంగరా జని యంద్రు జనులు

1. ఈపద్యార్థమూహ్యము.
2. శ్రీరంగరాజనుల్ కాంతోపయంత్రు—మాతృక.

తత్ప్రియశిష్యుండ ధగధగద్యుతులచేఁ
గడుమెఱుంగారు బంగారుగిన్నె
తెచ్చినాఁడను నీకు నిచ్చి రమ్మనఁగను
గైకొను మిది యనర్ఘంబు సుమ్ము
పలుకు తెలియంగ వినుము సామ్ములకు నేమి
వలసినవి యెల్ల నడుగు సువర్ణపాత్ర
మాత్ర మని యుండవలదు నీమనసులోన
గడియ సడలించు తల్పు మొక్కరము దిగిచి. 63

క. అనుమాట లోను వెలిగా
మొనసినపేరాస వారముఖ్యయు మఱి త
జ్జననియు నొండొరుఁ గడవం
జని దిగ్గనఁ దల్పు దీసి సంభ్రమ మొదవన్. 64

చ. వినయము సేయుతేవను రవి(ప్రతి)బింబము వోలె నప్పుడ
య్యనఘుని కేలుఁగెంజిరుటాకునఁ బోల్చుపసిండిగిన్నె గ
క్కున ముదిచెంచడంబు గయికొన్నది యైకుహనావటూత్తముం
దనయవరోధమందిరమునం దగునైందవరత్నవేదికన్. 65

గీ. ఉనిచి కడుగారవంబున ననఘచరిత
నట్టనడురేయి చెప్పుచున్నాను మమ్ము
నరమరలు లేక మీయుపాధ్యాయువలెను
నడపుకొనువార లెవ్వ రున్నారు గనుక. 66

క. నన్నెప్పుడు పొడగన్నం
గన్నులఁ గప్పుకొనుఁ బ్రియము గయికొను నామా

టన్న జవదాఁటఁ డతఁ డీ
కన్నియఁ దనప్రాణపదముగా భావించున్. 67

సీ. అదలించి యే మించనాడిన నొత లే
దను గాని మాఱుమాటాడరాఁడు
నెమ్మిమై మెలఁగంగ నేర్చుఁ గన్నుల మ్రొక్క
మనసున దీవించు మతముదోఁప
నొకనాఁటికంటె వే ఱొకనాఁడు లాలించు
నొకటఁ గా దన్నిట నుచితగతుల
నలవారు వీరలవలె జూటుఁదనము లే
దోడి కెటింగినవాఁడు గాఁడు
తాను మాదేవదేవియుఁ దమకములను
గరగరికలందు నొక్కరొక్కరికిఁ దొరసి
జోడువాయక మెలఁగంగఁ జూచునప్పు
డనఘ ! సంతోష మాత్మ నింతంత గాదు. 68

క. ఈనటనల మేమును మీ
పానియు నిన్నాళ్లు గూడిమాడి మెలంగన్
నానోటను బుట్టిన నని
యే నెఱుఁగక బేలనై మహీసురముఖ్యా ! 69

వ. గృహకృత్యప్రసంగంబులం గొంత యీాపడుచుపై నడిచిపను
చుం గసరుకొన్నం జూచి (తన్నా)డిన చందంబు దోఁచినం
గాఁబోలు న య్యభిమానశీలుండు నిజస్వరూపస్వభావంబు
లెఱుంగనివారికిం బాపిన తెఱంగునం గనకపాత్రం బిమ్మహా

నిశీథినీసమయంబున మిమ్ముఁ గడుబడ(లింప) మీచేతం బెట్టి
పంపిన వాఁడయ్యె నీయనుచితప్రయోజనంబు లెల్లం
బరులయెడం గాక తన మాయెడాటంబునం దగవు లగునే
యని వెండియు. 70

క. నావలని నేర్పు నేరమి
దేవరవలె నున్న మీకుఁ దేఁటపడంగా
నే వినిపింపక మఱి యిం
కేవారికి విన్నవింతు సిద్ధచరిత్రా! 71

మ. తనకుం గూర్చువధూమణుల్ చనవుచేతన్ మందెమేలంబువం
కను వేసారియు నవ్వటాలకునుఁ బల్లం బల్లువాక్యంబు లె
ల్లను నిక్కంబులుగాఁ దలంచి తగ దల్లన్నిర్నిమిత్తంబు నా
క్షున నే యుండుఁ గదా మునీశ్వరులకుం గోపంబు సాటోపమై.

ఉ. ఏనటు చిట్టు ముట్టనుచు నించుక కోపము తాళలేమి నా
పైనొకలాగునం గిటుకు వట్టిన దోసము గాదు దానుచుం
దానును నేఁటిదాఁక మమతం దగ నర్మిలిఁ గూడి యున్నవా
రా నెనరైననుం దలఁపఁ డయ్యెను దీని గణించి యేనియున్.

క. గుఱిచేసి గిన్నెఁ బంపిన
తరువాతను మల్లి పంపఁ దగ దంపినచో
మఱి నిన్నుఁ గొదవసేసిన
తెఱఁ గగుఁ గెళవులకు మీమదిం గడు నెడయున్. 74

క. తనసొమ్ము గాదె మాకల
ధన మెల్లను నేఁట నేమి తా మది నిఁక ము

న్వేసుకలకు మమ్ము నెట్లుఁ
మనుపుం దాఁ గాక మాకు మఱియుం గలదే. 75

క. విను మే నటువలె దూఱితి
నని మీమునితోడ మఱవక కనుమీ యని యా
చెనఁటి తనముద్దుఁగూఁతుం
గను గీఁటిన నదియు వగపు గలిగినశేవన్. 76

మ. తనసింగారపుఁ జెక్కుటద్దములమీఁదం జాఱుకన్నీరు కే
లినఖాగ్రంబులఁ బొఱమీటుచును దల్లి న్నూర్లనుగ్గించిమో
మునకుం దైన్యముగొంత తెచ్చికొనిడంబుల్ సూపియవ్విప్రునా
య్యాన డాయం జని యిట్లు వల్కెనురహాస్యాలాపరూపంబునన్.

గీ. తా నెఱింగియు నీజాతిగానిదాని
మాట లెల్లను గొండగా మదిఁ దలంచి
యల్ల నడురేయి గిన్నె యిట్లంపనేల
కుడిచి కూర్చుండి నను జాలిగొలుపనేల. 78

ఉ. ఆయెలదోఁటలోన సొబగయ్యెడుపుష్పొడితిన్నెమీఁదఁ గెం
జాయలఁబొల్చు లేఁజిగురుశయ్యఁ గెలంకులయందుఁదుమ్మెదల్
మ్రోయఁగ గోరువంకలను ముంగురు లల్లనదువ్వి దువ్వి న
న్నాయమ గారవించిన ప్రియంబులు నామదిఁ బాయ నేర్చునే.

క. ఈపాటి తనకు నెప్పుడు
నాపై దయ గలిగినందు(నకునిఁక) నన్నుం

జేపట్టు మనుము కంతుని
తూపుల నగునాదుమనసు[1]తుందుడు కడఁగున్. 80

క. ఓయనఘచరిత యిటువలె
నాయనచిత్తంబు వచ్చు నటు వలె వివిధో
పాయములఁ దెలిపి సరగున
నీయెడకుం బంప మీర లే కలవారల్. 81

సీ. అని గారవించి నెయ్యము మీఱఁ బలికినఁ
బనివిని యాదిమబ్రహ్మచారి
తనలోనఁ దా నవ్వుకొనుచు వెల్వడి వచ్చి
తలవాకిటను నిల్చి దండఁ బంచ
తిన్నెపైఁ బవళించి యున్న వాచంయమ
ముఖ్యునిఁ గనుఁగొని ముసుఁగు దిగిచి
వివరించి చూచి యోవిప్రనారాయణా!
యొంటిమై నిచ్చోట నుండనేల
ప్రియము మీఱఁగ విటకంటకియును దేవ
దేవియును మిమ్ముఁ దోడ్కొని తెమ్మటంచు
నన్నుఁ బంపిరి తాము నిం దాఁక వెఱచి
వచ్చినా రింక సరగఁ బోవలయు మీరు. 82

క. అన విని కల గనఁ బోలుదు
నని దిగ్గన లేచి చూచె నప్పుడు కృష్ణా

1. మనసుతుందును కలుగును—మాతృక.

జినదండకమండలుశో
భనములు గల మధురవచనపటువుఁ వటువున్. 83

వ. చూచి నివ్వెఱంగునం బులకితశరీరుం డై యిట్లనియె. 84

క. ఈలీల మదనవిశిఖ
జ్వాలలఁ బడకుండఁ గావ వగచినకరుణా
శాలివి నీవెవ్వరు నా
పాలింటను గల్గు రంగపతివో తండ్రీ ! 85

క. కని కరముతోడ నిటువలెఁ
బనివడి నెమ్మోము సఱచి పఱచినఁ గానీ
కనరానికటికిచీఁకటి
యనక ననుం గానవచ్చునా యొరుఁ డైనన్. 86

మ. అని సంతోషితచిత్తుఁ డై బహువిధవ్యాహారమాధుర్యలీ
ల నుతింపం దనపాణిపల్లవము కైలా గిచ్చి యమ్మౌనిఁ ద
ద్ఘనగేహప్రతిహారగేహాళిఁ జోరంగాఁ బాపి తా నాత్మర
మ్యనిశాంతంబున నుండె రంగపతి పద్మాదిప్రియాసక్తుఁ డై.

—* విప్రనారాయణుఁడు మరల వేశ్యయిల్లు సొచ్చుట *—

గీ. అంత నిక్కడ మానికులాగ్రగణ్యుఁ
డావటూత్తముఁ డటు సాగ నంపి చనినఁ
దొలుత మాటలువడి పుల్లసిలినవాఁడు
గనుకఁ గొంకుచుఁ దనయాత్మగతమునందు. 88

ఉ. కల్లరి బేరజంబు విటకంటకి మిక్కిలిఁ దత్తనూజయుం
దల్లి నతిక్రమించినను దాను వహించికొనంగఁ జాలది

ట్లల్లనఁ జేరఁదీసి యిపు డాచెడు గెక్కడ మొక్కపాటు దే
నుల్లమునం దలంచిన దొకో యని పోనటు దేవదేవియున్.

ఉ. వెన్నెలబైట నొక్కమణివేదికమీఁద మిటారి తేటవా
ల్గన్నులకన్నియ ల్చెలెఁకులక్ భజియింపఁగఁ దానమానసం
పన్ననవీనగానరసమాధురి వీనులవిందు సేయఁగాఁ
గిన్నెర మీటుచుండి పరికించుచు మానికులావతంసమున్.

చ. గరువము మీఱఁ జూచి గజగామిని దిగ్గన లేచి చేతికి
న్నర చెలిచేతి కిచ్చి రశనామణికింకిణికానినాదనూ
పురకఝుళంఝుళక్వణనము ల్మకరాంకచమూహళాహళీ
స్ఫురణవహింపఁ గ్రక్కునను బోయి యెదుర్కొని సంభ్రమంబునన్.

క. వేదండయాన తా నపు
డాదండను బోలుచుమణిగృహాంతరమునకుం
గైదండ యిచ్చి సుమనః
కోదండసమానుఁ దోడుకొని చని కడఁకన్. 92

క. అక్కడఁ దగఁ గుందనపుం
జెక్కడములఁ జాల నుల్లసిల్లుచు మిగులం
జొక్క మగుచున్న (రత్నపు)
ముక్కలిపై మానిచంద్రము న్నుంచి తగన్. 93

క. అంబుజముఖి బంగారపుఁ
దంబుగపన్నీట నడుగుఁదమ్ములు గడిగెం
బంబిననిగ్గుల వెన్నెల
డంబు వి(డంబించుపావడం) దడియొత్తెన్. 64

గీ. మేనఁ గలపంబుఁ గడువింతగా నలంది
గొనబుమీఱంగఁ దావిక్రొన్ననలు దుఱిమి
సన్నవలిపెంపువలెవాటు సవదరించి
కప్పురము నించి పచ్చిబాగా లొసంగి. 95

సీ. సకినెలపట్టెమంచము మించుపఱుపును
గెంబట్టుబటువులు గిండి జీని
పావడ బంగారుపావలు కాళంజి
కురువేరు పన్నీరుఁ (గోఱజంబు)
గోవజవ్వాది కుంకుమ గంధసారంబు
పునుఁగు కస్తూరి కప్పురము చాఁదు
జాలవల్లిక పుష్పతాళవృంతము నవ
రంజిగద్దియ హురుముంజిసురటి
యాదియగునట్టి వస్తువు లగురుధూప
ధూపితంబు వితానబంధురము సాల
భంజికాకీరదీపికాపరివృతంబు
భరితపారావతము నైన భవనమందు. 96

క. తరుణి రమించెను నత్తఱిఁ
బరిపరివిధములను వింతబాగుల హేలా
పరివర్ధితమోహారసా
చరితపునఃపునరనంగసంగరకేళిన్. 97

క. ఈలాగున రతికేళిం
దేలి పరిశ్రాంతిఁ బొంది నిద్రించిరి యా

లీలావతియుఁ దపోధన
శాలియు నంతం బ్రభాతసమయం బయ్యెన్. 98

ఉ. సమ్మదలీలఁ బంకరుహసద్మహజారములం గొలంకులం
గ్రమ్మమిళిందమాగధులగానము మించెను రంగశాయిగే
హమ్మున బోరున న్మొరసె నప్పు డహర్ముఖసూచకంబులై
యిమ్ముల శంఖదుందుభిసమీహితమంజులవాద్యఘోషముల్.

సీ. శ్రీరంగరంగసంస్మృతపూర్వజల్పాక
సద్యోవినిద్రపంజరశుకంబు
నగ్రతఃక్షోణీసమానీతపునరుక్తి...
...నఖముఖ లిహద్ధేనుకంబు
వివిధహేమకవాటవిఘటనావసరాయు
నాన్వేషబహిరుద్యదరుణభంబు
మలయభూధరమరుచ్చలితనానాగోపు
రార్ద్రిస్థలీవైజయంతికంబు
మాగధానూనజేగీయమానగాన
రససమాకర్ణనోత్ఫణప్రమదసమద
భావపర్యంకభుజగాధిపంబు నగుచు
వెలసె నప్పుడు తద్రమావిభునినగరు. 100

శా. ప్రౌఢస్వైరభుజప్రతాపరుచిదీప్తవ్యాప్తపర్యంతయు
గ్గాఢారణ్యమహీమతంగజఘటాగమ్యస్థలస్థాయి ఘుం
టాఢాంకారవిమోహితాహితచమూనానామృగాఖేటధీ
రూఢోత్సాహా! కదాచిదప్రతిహతక్రోధప్రసాదోదయా!

క. బబ్బరబాహాంక రమా
బిబ్బోకవతీనిశాంక బృందారకధు
న్యబ్బంధుకీర్తిరచితక
కుబ్బాలాకుచపటీర ! గుణగంభీరా ! 102

మాలిని. సరసిజదళచక్షుశ్చక్రవాకస్తనద్వ
య్యురుపులిననితంబప్రోల్లసజ్జహ్నుకన్యా
ఖరకిరణతనూజాగాధసాపత్న్యదోష
త్వరితశరధిగచ్ఛద్దానధారాధునీకా ! [1] 103

గద్య. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యా
నానందసౌందర్యధుర్యప్రబంధపరమేశ్వరవంశపవిత్ర లింగన
మనీషిపుత్త్ర శ్రీకాళహస్తీశ్వరదయాసహాయ చదల్వాడ
మల్లననామధేయప్రణీతం బైనవిప్రనారాయణచరిత్రం బను
మహాప్రబంధంబునం జతుర్థాశ్వాసము.



1. దానధారానిరాకా—మాతృక.

శ్రీరస్తు.

# విప్రనారాయణచరిత్రము.

## పంచమాశ్వాసము.



క. శ్రీమహితమహాకాళీ
నామకగృహదేవతాభినవకరుణాల
బ్ధామితవైభవ మానవ
తీమన్మథ మాకరాజుతిమ్మనృపాలా! 1

గీ. అవధరింపు ప్రభాత మి ట్లరుగుదేర
నంత కట మున్న మేల్కని యహిశయాను
నర్చనము సేయుటకు వేళ యయ్యె ననుచు
నతిరయంబున సహ్యకన్యకకు నరిగి. 2

వ. సముచితకరణీయంబులు దీర్చి వైష్ణవలక్ష్యమాణుండును గుం
డమండపవిధాన రథోత్సవ ధ్వజోత్సవ మాసోత్సవ వత్సరో
త్సవ ప్రతిష్ఠాప్రముఖమదవ దిందిరాయమాన మురదమనుం
డును ...గరకుంచికావలంబి యగునంబి చనుదెంచి రంగేశ్వ
రదర్శనాభిలాషంబుల బహిర్ద్వారప్రదేశంబుల నందంద క్రం
దుకొని యున్న తైర్థికుల సప్రసాదావలోకనంబులఁ గటాక్షిం
చి యొండొండఁ దలుపులగడియలు సడలించి యభ్యంతరమం
దిరంబునకుఁ జని— 3

క. నాగేంద్రశాయిఁ బేర్కొని
యాగర్భగృహప్రదేశ మారసి చూడన్
రాగిల్లుచును దదగ్రిమ
భాగంబున నున్నకనకపాత్రము లేమిన్. 4

క. నివ్వెఱఁగు భయము మనమున
నివ్వటిలం గడుఁ దలంకి నిన్నటినడు రే
యివ్వలన నున్నగిన్నియ
యెవ్విధమునఁ జనెనొ? తెలియ దే మఱువాఁడన్. 5

సీ. అని గర్భగృహ మెల్ల నల్లనఁ బరికించి
లెస్సగా నంతరా[1]ళిందమరసి
తిరుమజ్జనంబుబిందెలలోన శోధించి
పుష్పకరండకంబులను నెమకి
నిపుణత రంగమండపములో నారసి
యెలమి నుగ్రాణపుటిండ్లఁ జూచి
పటపల్లి చక్కిఁ దా నటు పరామరిసించి
యందులందుల సందుగొందు లరసి
యడుగఁదగువారి నెల్లను నడిగి మఱియు
వెదకఁ దగుతావు లెల్లను వెదకి యతఁడు
గిన్నె గానక యత్యంతఖిన్నుఁ డగుచు
సరభసంబునఁ దోడియర్చకులఁ దాను. 6

1. నంతరాళిమము వెదకి—మాతృక.

క. ఇదియెల్లను నధికారికి
విదితంబుగఁ దెలుపఁదగును వెసఁ దెలుపని-చోఁ
దుదఁ నేరమి మనదెస నగు
నది గాకీస్వామ్ము నరువు మందు రటంచున్. 7

క. ఆరంగవిభుని తిరుపం
దేరంబులుఁ దేరుబుట్లుఁ దివ్వియ లలరుం
బేరులుఁ దీర్ఘపుఁజెంబుల్
తోరము లగు గండములుంగని వారల్. 8

వ. అయ్యెడ. 9

సీ. జియ్యం లర్హాసనాసీనుఁడై వసియింపఁ
బొంతల నాచార్యపురుషుఁ డుండఁ
గెలన సాత్తనివైష్ణవులు ద్రోపుద్రోపాడ
వలన సంకీర్తనపరులు చనఁగఁ
గడగూటు లొక్కవంకను దొలంగుచునుండఁ
గొండికాండ్రను గెలంకుల నటింప
నూరెల వేత్రహస్తులు బరాబరిసేయఁ
బరిజనంబులు చాల బలసి కొలువ
గరిమఁ గొలువున్న యయ్యధికారవరునిఁ
దాము దెచ్చిన స్వామిగంధప్రసాద
పరికరం బిచ్చి పొడఁగని భయమునీఱఁ
జేరి వా రిట్లు విన్నవించిరి కడంగి. 10

గీ. అధిప! యిది యేమి దైవమాయాబలంబొ ?
గర్భగృహమున నైదుబంగరువుగిన్నె
లుండ నాగిన్నియలలోన నొక్కగొప్ప
గిన్నెఁ గానము తగఁ జిత్తగింపవలయు. 11

చ. వినుము రమావిభుండు తిరువీసము నిన్నటిరేయి యారగిం
చినతఱిఁ గోవెలం గలయశేషపదార్థచయంబు నుండఁగాఁ
గని నలుదిక్కు సూచి తిరుకాపుల వైచితి మిందు సందియం
బనఁగఁ నొకింత లేదు తెలియం దగు దీనికి హేతు వెద్దియో?

వ. అని పలికినఁ బ్రత్యుత్తరం బేమేనియు వచియింపం బూని
యున్నయధికారి నధిక్షేపించి ప్రకటభ్రుకుటీఘటనాదుర్నిరీ
క్ష్యుం డగుచు నయ్యేడ జియ్య భయభ్రాంతు లగు నంబులం
జూచి యి ట్లనియె. 13

క. పాతకులార! యనర్ఘం
బైతగు నపరంజిగిన్నె హరియించి కడుం
జాతురి మీ రెఱుఁగనిగతి
నీ తెఱఁగునఁ బోయె నందు రే, యెవ్వారల్ ? 14

మ. కనియుం గానమిఁ జేసికొన్నను నెఱుంగన్ లేక మారంగనా
ఘునిసొమ్మెల్లను బొల్లుగాఁ దిని దినద్రోహంబు వాటించి కై
కొనుటల్ చాలక గిన్నె యెత్తికొని బొంకుల్ పల్కుచున్ మేముగా
మనినం బోవునె? వేళ్లతోఁ జెఱకు దీపంచున్ దినం బాడియే.

శా. ప్రాకారంబు లలంఘనీయములు తోరంబుల్ కవాటంబు లా
యాకక్ష్యాంతరభూమియామికులసంఖ్యాకుల్గడున్ బీగముల్

వాకిళ్లుం బదిలఁబు లిట్టి నగ రెవ్వారలే చోరం జొత్తు రి
క్ష్మాకాంతావసథంబునం దిరుగుమీ రే కాక చర్చింపఁగన్.

గీ. అనిన గజగజ వణఁకుచు నయ్య రంగ
ధాముకోవెల మున్ను తాతలతరంబు
నాఁటనుండియు మాకుఁ గాణాచి గాదె
యెన్నిగుండెలు గలవయ్య యింతపనికి! 17

క. రంగప్రసాద్ము మేము తి
నంగను సుతుల మయి పుట్టినారము నిజ మై
నం గలదే మావలనను
దొంగతికంబులును వింత ద్రోహము లెందున్. 18

సీ. విను మేము ప్రాలుమాలిన దీవెనుడి గాక
కినిసిన రెండఁ గుగ్గిళ్లు గాక
తక్కిన నింత గంధప్రసాదము గాక
మన(సైన)నొక వడతునుక గాక
యటమటించినఁ గుంచెఁడంత సాదము గాక
కాదేని యొకగుల్లకాసు గాక
దాఁచికొన్నను బలితంపుఁ జింపుడు గాక
పిక్కిన నొకపోఁకవక్క గాక
యగణితానర్ఘమణిధగద్ధగితమహిమ
భాతిరోధానమృగితాహిపతిశయాన
సన్నిధానప్రతీప మీాగిన్నె మమ్ము
వంటివారలు గొన నెంతవార లయ్య! 19

క. అనిన యతి ముద్రకర్తం
గనుఁగొని యీ(ద్రో)ద్దకాండ్రు కడుమంచితనం
బున మనము సొమ్ము దెమ్మని
యనిచినఁ దేనేర్పువారలా? యే మైనన్. 20

మ. మొగమోటంబున నుండఁగాఁ జనదు నంబుల్ దుండగీలింతకే
పసిడి న్వచ్చు సువర్ణపాత్రము గణింప న్వీంద్రచే నాగతిం
దగఁ దెప్పింపక నీవు కన్నడవుచేతం బట్టి ప్రార్థించిన
న్నిగులం గెర్లుదుఁగాక తాళుకొనఁ జుమ్మీ యన్నభీతాత్ముఁడై.

క. యతివల్లభ! దేవరయా
నతికి న్మాఱాడువాఁడనా? గిన్నియ యే
గతి వేగమె తెప్పించెద
మతి మీ రలుగుదురె? యింతమాత్ర కటంచున్. 22

మ. అటు వీక్షించిన నీలికాసెలు విసీలాకారముల్ మేటిదు
ప్పటముల్ కోరసిగల్ పిడెంబులు ధనుర్బాణంబులుం బాణిసం
ఘటితోద్యల్లగుడంబులుం గలిగి యుగ్రస్ఫూర్తి నారక్షులు
ద్భటవృత్తిం దనచెంగట న్నిలువ నాతం డత్యహంకారుఁడై.

చ. తలవరులార! రంగపతిధామమునందునఁ బైఁడిగిన్నె ముం
చ్చిలినదురాత్ము లీదురితచిత్తులు నంబులు వీరి సందఱ్
సిలుగులఁబెట్టి వే హరువుసేయుఁడు పొం డని పంప వేగ వా
రలఁ గొనిపోయి తద్భటపరంపర యాఁకను బెట్టియుండఁగన్.

ఉ. ఆరజ మెల్ల నొక్కపొడ వయ్యె ననంగను బ్రాఁతిగానిసిం
గా(రము) తీరుమాలినవికారము నల్లనిబూచివంటి యా

కారము జుంజుఱై తిరులు గట్టి నెఱు ల్తుద బీఁటవాఱి వి
ప్పారెడుకీలుగంటుఁ బెఱయ న్విటకంటకిదాసి యయ్యెడన్.

సీ. జూదంబు లాడెడుచోటికై యరుగుచు
గంజాప్రదేశంబుకడకుఁ జనుచుఁ
దనపిడఁ ద్రోవవెంటను జూచికొనుచును
బనిలేనిపని పకపకని నగుచు
నెవ్వారిఁ బొడగన్న నెకసక్కెమాడుచు
నంగన ల్గలసి తిట్టాడ వినుచు
మాటిమాటికిని సుమాళించి పాడుచుఁ
బులియుచుఁ దనుఁదానె పొగడికొనుచుఁ
బని యొకటి గల్గి రంగనాథుని గృహంబు
వలని కేతెంచి చంచలవాణి యనెడు
పేరు నిజముగ నట నడ్డపెట్టియున్న
నంబులను జూచి యానిమిత్తంబుఁ దెలియ. 26

చ. ఒకటఁ గొఱంత లేక హరియూడిగముం దగఁజేయుచున్నయ
ర్చకులకు నింతదుర్దశలు రాఁ బని యేమని వారి వారల
న్నకలము లెస్సగా నడిగి చంచలవాణి యెఱింగి యింతమా
త్రకు నిటు బాములం బఱతురా గుడికిం దగు లైననంబులన్.

క. ఆపసిఁడిగిన్నె యెవ్వరి
చేపడియెనొ వీరి నేల సిలుగులఁ బెట్టం
జూపోపరుగా మీాయది
యేపాటిది గలదు తెలుపుఁ డింతయు నన్నన్. 28

ఉ. అక్కడ నున్నవార లహహా యని నవ్వి పిసాళితొత్తె! నీ
వెక్కడ నింతలేసిపను లెక్కడ పోవుగదంచు నందఱుం
బక్కునఁ దిట్టినం గసరి పల్కెను మీ రిటు సల్పినంత నే
తక్కువ యయ్యెనే కలితనంబును నా దొకమాటవాసియున్.

ఈలాగున నన్నేటికిఁ
గేలిగొనం బోయి యున్నగిన్నియ తగ మా
యేలికసాని గడించిన
మేలిమిగిన్నియకుఁ దుల్యమే యేమైనన్. 30

అని పలికినం దదీయవచనంబులు విని వెండియుం బదిలపడ
నడిగి వారు దానిం దోడ్కొని వారియధికారి సన్నిధానంబు
నం బెట్టిన నతండు సామవచనంబులం బుజ్జగించియు నదలిం
చియుం గల్గినవిధం బెఱింగింపు మనవుఁడు నదియును వడ
వడ వడంకుచు ని ట్లనియె; నయ్యా! నిన్న నగరంబు మాఁ
టుమడఁగిన సమయంబున ము న్నెన్నఁడుఁ గన్న తెఱుంగు
వాఁడు గాఁడు వటువేషధారు డగు నొక్కరుం డింటికి నొంటి
మైఁ జనుదెంచి చూడ్కులు మిఱుమిట్లు గొను నొకయపరంజి
గిన్నియఁ దెచ్చి మాయేలికసానిచేతి కిచ్చి క్రమ్మఱుం జనియె
నిది నాయెఱింగిన చందం బిట మీఁద నేమియుం దెలి
సినదానం గా నని విన్నవించిన నాగొంటరివెంటం దలవరులం
గూర్చి మీ రిది చూపినజాడ (వేశ్య) మందిరంబున కరిగి
కనకపాత్రం బిచ్చినవానిం బుచ్చికొన్నదానిం బట్టి తెం డని
పనిచిన— 31

క. గుడిసంబులకును దయతో
నుడుగర లిప్పించి ద్రోహ మొక్కింతయు మీ
యెడ... ... ...
యుడిగం జేమఱకుఁ డనుచు నొగిఁ దలవరులున్ 32

క. అందఱుఁ జని విటకంటకి
మందిరమున కరిగి పట్టెమంచమునందున్
గందళితానందంబున
.........సొదడించుచునుండన్. 33

క. వసియించి యున్నతపసిం
బొసఁగం దత్పదము లొత్తుపొలఁతిన్ దండన్
మిసమిసల మెఱుఁగుగిన్నియ
వెసఁ గన్గొని వారు రోషవివశాత్మకులై. 34

శా. ఇన్నాళ్లున్ గణికాశిరోమణులలో నెల్లం గదున్ మేటివై
మన్నీ లెల్లరు గారవింపఁగను హేమగ్రామనానార్థసం
పన్నత్వంబున నున్నదాన వని చెప్పన్ విందు మిస్సిస్సిరో!
యె... ...దొంగసొమ్ములకు నై యిట్లేల ప్రాల్మాలితే? 35

—* తలవరులు బంగరుగిన్నె కనిపెట్టుట *—

క. నీతి విచారించినచో
జాతులయం దెల్ల విప్రజాతికిఁ బ్రతి లే
దేతఱి బాఁపఁడ వయ్యును
నీ తెఱఁగున దొంగిలింప నెట్లెఱిఁగితిరా! 36

గీ. అనుచు నలదేవదేవిని సమ్మనింపఁ
దగువిధంబున రాజపథంబుఁ దరిసి
తోడికొని వచ్చునప్పుడు వాడవాడ
బలసి మూఁకలు మూఁకలై పౌరులెల్ల. 37

ఉ. ఈసరసీరుహాక్షి జన మెల్ల నెఱుంగఁగ నిప్పురంబులో
మూసినముత్తియంబుగతి ముగ్ధ యనంగఁ బ్రసిద్ధిఁ గన్న దా
భూసురవర్యుఁ డెంతటితపోమహిమాఢ్యుఁడొ కాక చూచినం
జేసినపాపముల్ పొలియఁ జేయఁదొడంగెఁ దదీయ తేజముల్.

గీ. ఇతఁడు చోరుఁడు గాఁ డని యెంతకైన
నిలువ నాడంగవచ్చు నీనీలవేణి
గోల యగుటయు నిక్కంబ యేల యిట్లు
వచ్చె వీరికి నీయపవాద మిపుడు. 39

సీ. నగరికి నాదాయ మగువేళ యిది యని
తగవు మాలిన పనుల్ తడవిరేని
యొంటనివారిపై నోర్వఁ జాలనివారు
లేనినేరంబు గల్పించిరేని
తోడఁబడి సొమ్ము పోఁబడి యెఱుంగక నోరఁ
గొలఁదు లొక్కనిఁ జూచి పలికిరేని
యొరుదలగా వచ్చి యొగి మఱుంగు పడంగఁ
జెవి నిల్లు గట్టుక చెప్పిరేని
పదర కధిపతి తెలియఁగఁ బాడియగును
గాక యెద్దినె నన గొందిఁ గట్టుపనికి

నేమనఁగ వచ్చుఁ బ్రజలకు నెల్లయెడలఁ
దల్లి దండ్రియు నేలినాతండు గాఁడె? 40

ఉ. భోగవిలాసరేఖ నలువొందెడు నీయనఘుండు నంగనా
భోగవశాత్ముఁడై నిజతపోమహిమంబులు వీటిఁబుచ్చి ల
జ్జాగరిమల్ దొఱఁగుటలు చాలక యీతఁడు దొంగకూటికే
లాగునఁ జొచ్చెఁ దాఁదలపొలంబులనిల్చునె సాదురేఁగినన్?

క. అని పౌరులు పలుదెఱఁగులఁ
గొనకొని పలుకంగ వారిఁ గొని రభసమునం
జని ముద్రకర్త సమ్ముఖ
మునఁ దలవరు లుంచి కేలు మోడ్చిన నతఁడున్. 42

ఉ. ఇంతప్రయోజనంబు తను నేలినయేలిక చోళధారుణీ
కాంతునకుఁ సవిస్తరముగా వినిపింపక నేనహంక్రియా
వంతుఁడనై గణించి తగువైపునఁ దీర్ప నతండు విన్న నా
కింతయు మాటవచ్చు నని యెన్నిక నయ్యధికారి గ్రక్కునన్.

శా. ఆలీలావతి నత్తపోధనునితో నాగిన్నె చోళక్షమా
పాలాగ్రేసరుసన్నిధి న్నిలుపఁ దత్పర్యాయవార్తల్ గభీ
రాలాపంబుల విన్నవించిన నతం డాశ్చర్యముం బొంది యా
రాలెన్సామెనుస్వామిసొమ్ముగొనినారా ద్రోహులంచుంగడున్.

వ. పొడముకినుక యెడ నిడికొని చౌర్య ప్రసంగంబులు సాంగం
బులుగాఁ దెలియవలసి దేవదేవి నాలోకించి— 45

సీ. వనజాక్షుసమ్ముఖంబున నుండుగిన్నియ
యువిద! నీ కెక్కడనుండి వచ్చె?

నెవ్వరైనను దెచ్చి యిచ్చిరో మఱి నీవె
కైకొన్నదానవా? కనుమొఱంగి
యీ విప్రుఁ డుండెడితావు దా నెక్కడ?
నెన్నాళ్లు గలఁ డితఁ డిటకు వచ్చి
యింతనేరము సేయ నేరీతి మనసొగ్గె?
మేటివస్తువుల నేమిటఁ గొఱంత?
వివరపుట్టంగ నానుపూర్వియనుగాను
దగ నెఱింగింపు మని మహీధవుకు లేశుఁ
డానతిచ్చిన విని పంక[1]జాయతాక్షి
వినయ మెనయంగ నటు వెనువెనుక కరిగి. 46

ఉ. (తానె)లదోఁట కేఁగినవిధంబు మునిం గనుఁగొన్న చందముఁ
వానికిఁ గాఁ గఁ బన్నిదము వైచినమాటయు బేలువెట్టి య
మ్మానినిదోడితెచ్చినక్రమం బతనిఁ మొగమోటమొక్కయిం
తైనను లేక తల్లి విడనాడినచందముఁ జెప్పి వెండియున్. 47

శా. ఓ రాజన్యభవాన్వయాభరణ! యీయుర్వీసురేంద్రుండు మే
మారీతిఁ వెడలంగ ద్రొబ్బినను లజ్జాక్రాంతుఁడై పైఁడిగి
న్నేరూపంబునఁ దెచ్చెనో యెఱుఁగ నా కిప్పించెఁ దా శిష్యుచే
శ్రీరంగప్పఁడె సాక్షి యింతకు వితర్కింపఁ వివేకోన్నతా!

గీ. అనుడు ధరణీశుఁ డాతపోధనునిఁ జూచి
వింటివా యోయి! యీమచ్చెకంటి యాడి

1. పంకజాతనేత్రి—మాతృక.

నట్టిమాటలు తెలియ నేమైన నిందుఁ
గలది లేనిది గలిగినఁ దెలుపవలయు. 49

మ. అసినక్ సంయమిచిత్తగింపఁదగున్యాయాన్యాయముల్ కల్లతో
డ నిజం బొప్ప...బ్బ లోకు లనుమాటల్ నిక్కముల్ రూఢి కె
క్కునె ? నామాటల తీరు దీని వగుబొంకుల్ విన్నచో నైననే
నును నా నేర్చినరీతిఁ దథ్య మెఱిఁగింతున్ ధారుణీవల్లభా !

క. ఇది చెప్పినట్ల యేనది
మొదలన్ దీనింటఁ దమకమున మెలఁగుటయుం
దుద నను వెడలించుటయును
విదితము కడమాట విన్నవించెద నీకున్. 51

ఉ. నన్నటు వీడనాడిన మనంబున ముప్పిరి గొన్నజాలి నే
విన్నఁదనంబుఁ దాల్చి నడివీథికడం దగుపంచతిన్నెపై
నున్నను దానుబంప వటువొక్కఁడు చామనచాయ మేనివాఁ
డన్నడు రేయి వీరల గృహంబునకుం గొనిపోయె నర్మిలిన్. 52

ఉ. ఈమటుమాయలాఁడియును నెప్పటికంటెను నన్నుఁ గైతవ
ప్రేమను గారవించి యలరింపఁగ నుండితిఁ గాని గిన్నెమా
టేమియు నే నెఱుంగ ధరణీశ్వర ! కా దని పల్కితేని యా
స్వామియె సాక్షియింతయు నిజంబిఁకనావుడు దేవదేవియున్.

క. పోరిఁబోరిన మోరి దొంగల
గురువ ! మహారాజు వినఁగఁ గొంకక మిథ్యా
పరిభాషలు పచరింతురె
సరివారలు నవ్వ నీహజారమునందున్. 54

గీ. నాలిమాటలు నీపట్టైనామములును
శపథములుఁ జూచి నిక్కంబ సాధు వనుచు
నమ్మితినిగాక యిట్లలనాఁడె నీవు
గుణ మెఱింగిన వెడలంగఁ గొట్టి విడుతు. 55

ఉ. వాదుల కేమి (కార్మోగులు) వన్నియశిష్యునిచేతఁ బంపఁగా
లేదె సువర్ణపాత్రము మలిమ్లుచశేఖర ! యెల్లవారిచేఁ
గా దనిపించుకో ఫలము గల్గునె యూరక రిత్తమాటలం
బోదుసుమీయవజ్ఞ(యనఁబోటిఁ)గనుంగొనిసస్మితాస్యుఁడై.

గీ. ఏల పదరెదు నీకును హెచ్చు కుందు
మాటలకు నెంత యిన్నాళ్లు మాకులేని
వటువు నడురేయి యొదుండి వచ్చెఁ జెపుమ
యిట్టిమాట... ...నది విధి. 57

వ. అని పలుకువారలం గలకలహంబు వారించి వయోరాజ్య
దుర్వారగర్వారంభ శీలుం డగునమ్మహీపాలుం డు [1]సభ్యులం
జూచి మీ రీయిరు(వుర)కలహంబు లాకర్ణించితిరి, నామనం
బునం దెలివిపడిన తెఱం గెఱింగించెద. 58

క. వెలయాలి కెవ్వ రిచ్చిన
వలసినగతిఁ గైకొనంగవచ్చుఁ సొమ్ముల్
తలఁప నటు గాక...
......క్తి గలుగునే యేమైనన్. 59

1. సభికులం జూచి—మాతృక.

క. అటు గాక తన్నుఁ బిలువఁగ
వటు వొక్కఁడు వచ్చె ననియె వసుధామరుఁడుం
గుటిలాలకకును వటువే
యట గిన్నియఁ దెచ్చి యిచ్చె... ... 60

ఉ. కానఁ దపస్విఁ బిల్వఁగ నొకానొకచేడియ లేదె బంటువాఁ
డైనను లేఁడె యవ్వటువు నంపఁగ నేటికి? బ్రహ్మచారియుం
దా నడురేయి దీని సదనంబునకుం జనుదేర నేమి యీ
(మానినియొద్ద) లేవు వెడమాయలునుం బొరలింపుమాటలున్.

శా. తా నే దొంగిలి గిన్నె శిష్యవరుచేతం బంపి చౌర్యంబు పై
లైనం దూఁటిచనంగ నేరమిని యీ......నం
గా నేర్పుల్ పచరించి బొంకిన నెఱుంగ న్రాదె యీనుల్పు వీఁ
డే నిక్కం బగుకన్నగాఁడని ధరిత్రీశాగ్రగణ్యుం డనన్. 62

క. ఆనృపతి పలుకు లుచితం
బై(నవి యని) యెల్లవారు నని రప్పుడు "రా
జానుమతో ధర్మ", యన
న్నానుత మగుపల్కు నిశ్చయంబగుఁ గాదే. 63

వ. ఇవ్విధంబున నమ్మహీపాలపుంగవుండు తనయందుఁ గలుగని దొంగతికం బాపాదించుటకుం గసలి యపవాదంబు పరిహ రించుకొనునుపాయంబునుం గానక యమ్మునివరుండు నిజహృ దయకర్ణికాధాముం డగురంగధాముం దలంచిన—— 64

—* రంగపతి ప్రత్యక్షమగుట. *—

సీ. శీవిమైఁ గటిని గట్టినపచ్చపట్టును
బాక్షిటి నేత్రమ్మిఁ బొలుచు నిసువు
నిగనిగ ప్రభల నీనెడు కౌస్తుభంబును
బేరురంబున విడంబించుసతియు
మిసమిసల్ నిగిడించు మొసలివాతెఱయొంట్లు
నొక కేలఁ బద్మంబు నొకట గదయు
నగణితరుచిధగద్ధగితకిరీటంబుఁ
గరుణాసుధాధార గ్రమ్ముచూపు
గలిగి సురసిద్ధగంధర్వఖచరసాధ్య
మఘవముఖదేవసంస్తూయమానుఁ డగుచు
విహగపతి నెక్కి శ్రీరంగవిభుఁడు తపసి
యగ్రభాగంబునందుఁ బ్రత్యక్ష మయ్యె. 65

గీ. విప్రవర్యుఁడు భయమును విస్మయంబుఁ
బ్రమదరసమును మనమునఁ బల్లవింప
ఫాలపీఠిక నంజలి పరిఢవిల్ల
బహువిధంబుల నిట్లని ప్రస్తుతించె. 66

లయగ్రాహి.
ఇందురవినేత్ర యరవిందభవముఖ్యసుర
వందితపదాబ్జ ధృతమం
క్రందనమణీఘనమిళిందసమదేహరుచి
వందితప్రసన్నహరిచంద

మందకరుణారస ముకుంద మురఘస్మర స
నందనముఖాదిమునిబృందనుతవిద్యా
నందమయరూప హరి నందకులధారివర
నందన ఫణిగ్రసనతుందిలతురంగా. 67

చ. హరిహయపద్మసంభవముఖామరదుర్లభలీలఁ బొల్చునీ
చరణసరోరుహంబులు ప్రసన్నత నాకొనఁగూర్చె మత్పురా
చరితము లైనయట్టికలుషంబులు వీడెఁ గృతార్థభావముం
బొరసితిఁ గోర్కులుగ ఫలముఁ బొందెను భక్తజనావనప్రియా!

గీ. ఎందు మాదృశు లగువారియందుఁ గలుగు
కొదవ లెన్నవు భుక్తిముక్తులు నొసంగఁ
జాలుచున్నాఁడ వేమని సన్నుతింతుఁ
జక్రధర నీదుభక్తవాత్సల్యమహిమ. 69

క. అనుచుం బెక్కుతెఱంగుల
వినుతించిన రంగశాయి వెలిదమ్మికనుం
గొనలఁ గనికరపుఁదుప్పర
చినుకఁగ నిట్లనియె యోగిశేఖరుతోడన్. 70

ఉ. ఆర్యవరేణ్య! నీ వహరహంబు నొనర్చిన పుష్పదామకైం
కర్యము మన్మనఃప్రమదకారణ మయ్యెను నీదుభక్తితా
త్పర్యము గారుడప్రముఖభాగవతాచరితార్చనాతప
శ్చర్యలకంటె నన్నును బ్రసన్నునిఁ జేసె విశేషసంపదన్. 71

క. కావున నోవత్స! జగ
త్పావనచారిత్ర నీకుఁ బరమప్రీతిం

గానలసినవర మిచ్చెద
నీ వేఁడు మటంచు నానతిచ్చిన నతఁడున్. 72
క్రమ్మఱఁ బ్రణమిల్లి మదిన్
సమ్మద ముప్పొంగ భక్తజనవత్సల ని
న్నిమ్ముల దర్శించితి వర
మిమ్మనఁగాఁ గలదె యింక నెయ్యది యైనన్. 73
అయినను సకలశుభావహంబగుభవదనుగ్రహం బపరిహా
ర్యంబు గావున మనంబునం గలతెఱంగు వినిపించెద, దేవా!
భక్తాంఘ్రిరేణు వనియెడు నామధేయంబు నాకుం బ్రసాదించి
కృతకృత్యుం జేయు మని ప్రార్థించిన— 74
అనలినోదరుఁ డట్టే
కానిమ్మని వరము మునిశిఖామణికి దయం
... ... ...
నానతుఁ డగుచోళనృపవరాగ్రణిఁ బలికెన్. 75
ఓరినృపాల! యీయనఘు యోగికులాభరణంబు మత్పదాం
భోరుహసేవనారతుఁ దపోధను ... ... ...
... ... ... ...నీతి దొఱంగి సభాంతరంబునం
జోరుఁ డటంచుఁ బల్కి పడుచుంబని సేయుట నీకు ధర్మమే.
కనకపుగిన్నెఁ దెచ్చి విటకంటకి కిచ్చినవాఁ(డ నేను) మ
త్తనయుఁడు(వీఁడుసూకొడుకు)తండ్రిధనంబునకర్హుఁడౌటము
న్వినవె? వివేకి గానిధరణీధవు రాజ్యమునం బ్రజానురం
జన మొనగూడ నేర్చునె విచారము లేదెయొకింత యేనియున్?

క. ఇమ్మునివరు మామాఱుగ
నెమ్మిని భజియింపు చోళనృపతీ! యని యా
క్రొమ్మించుగిన్నె పడుపుం
గొమ్మకు నిప్పింప మానికుంజరుఁ బల్కున్. 78

గీ. మునుపు నే దానికొసఁగిన కనకపాత్ర
తెచ్చితివి దేవదేవికిఁ దిరుగ నిమ్ము
యెందు వెల్లాటకత్తియ కిచ్చినట్టి
సొమ్ము మగుడంగఁ గొనుట యేసుగుడితనము?

సీ. వా దగుగోపకాంతావిహారము విన్న
వారల కెట్టి శాశ్వతవిభూతి
దొరకు నట్టిది గల్గుఁ బరమమా (నీదివ్య)
చరితంబు వినినట్టి జనుల కెల్ల
నని యానతిచ్చిన నతఁడు శ్రీమాలిక
యనఁగఁ బ్రాబోధిక యనఁగఁ బరఁగు
కృతులను వర్ణింపఁ గృతకృత్యుఁ గావించి
రంగశాయి తదంతరంగమందుఁ
దాఁ బ్రవేశించె దివ్యవాద్యములు మొరసె
జలజలని నింగిఁ బుష్పవర్షములు గురిసె
నమరజయజయశబ్దఘోషములు బెరసె
నప్పు డచ్చర(గము)ల లాస్యములు మెఱసె. 80

క. ఆచోళనృపవరేణ్యుఁడు
వాచంయమవరునిఁ జేరవచ్చి మునీంద్రా!

నా చేసినయపరాధము
గాచి నను బ్రోవవయ్య కరుణాజలధీ! 81

క. దేవర తల్లివి దండ్రివి
దైవంబవు గురుఁడ వఖిలదాతవు నిన్నుం
గేవలమర్త్యుఁడ వనుచున్
భావించితి దీని కేమనంగలవాఁడన్. 82

వ. అని ప్రార్థించి గంధవహబాంధవంబు లగుసైంధవంబులును ......తరంబు లగు ద్విరదంబులును బరభయదమహోద్భటు లగువీరభటులును, నీతికళాధాను లగుప్రధానులును, బరాక్రమవంతు లగుసామంతులును......గాణిక్యమాణిక్యంబులును మొదలుగాఁ గొల్వ సకలసన్నాహసమేతుం డై మహావైభవంబునం జోళేశ్వరుం డమ్మునికులేశ్వరు......భేరీ శంఖ మృదంగాది వాద్యఘోషంబులు బోరుకలంగఁ బురంధ్రీనికర కరకనత్కనకపాత్రనీరాజనంబులు, భూసురాశీర్వాదంబులు ...మణివితానంబులం గనుపట్టుతిరువీథుల...ల్లం గొలిచి సేవించి, తత్ప్రసాదంబునం గృతార్థత్వంబునుం బొంది... ప్రజాపాలనంబు గావించుచు శాశ్వత...రంబు లనుభవించుచుండె. 83

ఉ. అంచితపుణ్యుఁ డమ్మునికులాగ్రణియు న్నుమదాఖము ల్సమ
ర్పించుచుఁ బెక్కువైఖరులఁ బేర్కొనుచున్ హృదయాబ్జమందు భా
వించుచు రంగశాయిఁ గడు వేడుక నిచ్చలు నెప్పటట్లు సే
వించుచునుండె సర్వజనవిస్మయహేతుమహానుభావతన్. 84

క. ఆదేవదేవియును ముని
యాదరమున ధన్యనైతి నని రంగేశ
శ్రీదయితునకును ధనకన
కాదు లొసంగె న్విరక్తురాలై యుండెన్. 85

మ. ఎనయ న్మానవు లెట్టివారయినఁ దారీవిప్రనారాయణా
ఖ్యుని[1] ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...

గద్యము. ఇది శ్రీ శంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్యధుర్య ప్రబంధపరమేశ్వరవంశపవిత్ర లింగనమనీషిపుత్ర శ్రీకాళహస్తీశ్వరదయాసహాయ చదలవాడ మల్లననామధేయప్రణీతంబైన విప్రనారాయణచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

సర్వము సంపూర్ణము.

---

1. ఈఫలశ్రుతితుదిభాగమును నాశ్వాసాంతపద్యగద్యములును లేవు.